# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక



4 అణాలు

6-8-52

పంచతంత్రం



# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి




































భార్యపోరు పడలేకను
ఆబ్రాహ్మడు పొరుగూరికి
బయలుదేరి పోయాడు
అడవిదారి పోతుండగ
దప్పికగొని పాడుబావి
కనిపించగ వెళ్లాడు

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 48
6-8-52

నందన శ్రావణ బహుళ పాడ్యమి బుధవారము



శ్రీరంగ పట్నంలో టిప్పుసుల్తాన్ చిత్రశాల
'దరియాదౌలత్' లోని ఆర్చివే.

ఛాయా చిత్రకారుడు : సినిమానటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు.

# ఆంధ్రరాష్ట్రం: వివిధపార్టీలకృషి

ఆంధ్రరాష్ట్రం విషయమై పండిట్ నెహ్రూ సుముఖంగా ఉన్నట్లు ఇప్పటికి వివిధ పార్టీల నాయకులకు విశ్వాసం కలిగింది. కొందరు నాయకులతో స్వయంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నట్లు పండిట్ నెహ్రూ పార్లమెంటులో తెలియపరిచారు. వివిధ వర్గాల నాయకుల మధ్య ఏకాభిప్రాయం ఉంటే ఇప్పుడైనా ఆంధ్రరాష్ట్రనిర్మాణం జాప్యం కాదని నెహ్రూ ప్రకటనవల్ల స్పష్టపడింది. అందువల్ల తిరిగి ఆంధ్రదేశంలో సంచలనం బయలుదేరింది. అన్ని పార్టీల నాయకుల్నీ సమావేశపరచడానికి ఆంధ్ర మహాసభ కృషి చేసింది. 23 మంది రాయలసీమ ప్రతినిధులుమాత్రం రాష్ట్రనిర్మాణానికి ప్రతికూలభావం ప్రకటించి పండిట్ నెహ్రూకు విజ్ఞప్తి పంపారు. ఈ ప్రతినిధుల ప్రతికూలభావాన్ని విమర్శిస్తూ మరి కొందరు రాయలసీమ ప్రతినిధులు పత్రికా ప్రకటన చేశారు.

ఆంధ్రమహాసభ ఆధ్వర్యంక్రింద చెన్నపట్నం మెమోరియల్ హాలులో జరిగిన సభలో మహాసభ నాయకులు, కమ్యూనిస్టు పార్టీ, ప్రజాపార్టీ, సోషలిస్టుపార్టీ, కృషికార్ లోక్ పార్టీ, స్వతంత్రులు, ఇద్దరు ముగ్గురు కాంగ్రెస్ ప్రతినిధులు పాల్గొన్నారు. ఆయా నాయకుల ప్రసంగాలను చూస్తే మద్రాసుగురించి ఏకాభిప్రాయం లేదని స్పష్టపడుతూనే ఉంది. ఆంధ్రకాంగ్రెస్ శాసనసభ్యులను శ్రీ సంజీవిరెడ్డిగారు సమావేశపరిచారు. ఆ సభలో కూడా ఏకాభిప్రాయం కనపడ లేదు. అందువల్ల ఆంధ్రకాంగ్రెస్ సర్వసభ్య సమావేశాన్ని సెప్టెంబరులో జరిపి ఈ విషయమై చర్చించి ఒక నిర్ణయానికి రాగలరని సంజీవిరెడ్డిగారు ప్రకటించారు. అంటే ఆ తదుపరి కాంగ్రెస్‌వారందరూ ఆ నిర్ణయానికే ఒడబడి ఉండాలనీ, ఆపైన కాంగ్రెస్‌వాదులు భిన్న అభిప్రాయాలను ప్రచారం చెయ్యకుండా నివారించాలనీ ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షుడు యత్నిస్తున్నారన్న మాట.

### "ఏకాభిప్రాయం"

అయితే నిజానికి ఆంధ్రదేశనాయకుల మధ్య 'ఏకాభిప్రాయం' లేదనుకోడం పొరపాటు. నెహ్రూ - పటేల్ - పట్టాభి నివేదికలో విధించబడిన షరతులను నిజానికి ఆంధ్రదేశంలోని ఏ నాయకుడూ హృదయపూర్వకంగా అంగీకరించడం లేదు. అయితే తక్షణం రాష్ట్రం కావాలని అందరూ వాంఛిస్తున్నందువల్ల, ఆ షరతులదృష్ట్యా ఆంధ్రుల కర్తవ్య మేమిటనే విషయంపైన మాత్రమే భిన్న అభిప్రాయాలున్నాయి. ఈ భిన్న అభిప్రాయాలు కూడా పార్టీలపరంగా భేదించడం లేదు. ప్రతి పార్టీలోనూ అన్నిరకాల అభిప్రాయాలు గలవారూ ఉన్నారు-(కమ్యూనిస్టు పార్టీ మినహా). మద్రాసుకోసం ఆంధ్ర రాష్ట్రనిర్మాణాన్ని వొదులుకోవాలని ఖండితంగా చెప్పే నాయకులెవరూ లేరు. (రాయలసీమలో కొందరు అలా చెప్పేవారున్నా వారి మాటకు దేశంలో కాని, ఏ పార్టీలో కాని బలమూ పలుకుబడీ లేవు.) మద్రాసుపై ఆంధ్రులకు గల హక్కుల నేవిధంగా కాపాడుకోవాలనే విషయమై భిన్న అభిప్రాయాలున్నాయి. అయితే మద్రాసుపైన ఆంధ్రులకు ఎంతో కొంత హక్కు ఉన్నదని అందరూ ఏకగ్రీవంగా అంటున్నారు.

కాబట్టి ఆంధ్ర రాష్ట్రం విషయంలో నాయకులమధ్య ఏకాభిప్రాయం లేదని పదేపదే ప్రకటించేవారికి ఈ సత్యాన్ని గుర్తుకు తేవడం అవసరం.

మద్రాసు నగరం విషయమై ఆంధ్రులు చెయ్యదగినది అత్యల్పమని స్పష్టపడుతూనే

## విషయానుక్రమణిక


ముఖచిత్రం :
హిందీతార మధుబాల
వ్యాఖ్యలు, విమర్శలు 2
స్వాతంత్ర్యసిద్ధి—శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి 4
దూరదృష్టి—'కనక్ ప్రవాసి' 8
రెండు మహానగరాలు—చార్లెస్ డికెన్స్ 12
భుక్తాయాసము—శ్రీ కె. లక్ష్మీరఘురామ్ 16
కథ అడ్డం తిరిగింది—శ్రీ కొలజ్ఞానం రామారావు 17
మరణాంతాని వైరాణి—శ్రీ పి. వి. భట్టశర్మ 21
విజ్ఞాన వీథులు— 23
లకలుకలు—శ్రీమతి పోల వరపు ఝాన్సీలక్ష్మీబాయి 24
బొమ్మరిల్లు— 26
సినిమా— 40
ప్రశ్నలు-సమాధానాలు 46

ఉంది. నగరంపైన ఆంధ్రులకు ఏకొంతో హక్కు లేకపోలేదని నెహ్రూ - పటేల్ - పట్టాభి నివేదికలో గుర్తించబడిందని మనం జ్ఞప్తిలో ఉంచుకోవాలి. ఆ నివేదికలోని ఆదేశంప్రకారం ఆ హక్కును ఇప్పుడు ఆంధ్రులు వొదులుకోవడం అంటే వొదులుకోవడం శాశ్వతమనే మాట స్పష్టమే. ఈ పరిస్థితిలో మద్రాసు నగరంలో ఆంధ్రుల స్థితిగతులను గురించీ, విద్యాసౌకర్యాలు మొదలైన అంశాలలో ఆంధ్రుల అవసరాలను తీర్చడంగురించీ కేంద్రప్రభుత్వంగాని మద్రాసు ప్రభుత్వంగాని ఎట్టి హామీ ఇవ్వకుండానే మద్రాసుపై హక్కు వొదులుకోవడం ఆంధ్రదేశ నాయకులందరికీ బాధగానేవుంది (కమ్యూనిస్టులకు తప్ప). మద్రాసుపై హక్కు వొదులుకోడానికి నాయకులు సిద్ధంగానే ఉన్నారు కాని వొదులుకున్న హక్కులపరంగా ఆంధ్రులకివ్వగల సంరక్షణలు ఎటువంటివో, హక్కులు వొదులుకోమన్నవారు నిర్వర్తించవలసిన బాధ్యత ఎటువంటిదో గుర్తుకు తేవడం ఆంధ్రదేశ నాయకుల కర్తవ్యం. ఆంధ్రకాంగ్రెస్ పక్షాన కాంగ్రెస్ కార్యవర్గసభ్యులు సంజీవిరెడ్డిగారు, ఆంధ్రమహాసభ సమావేశపరిచిన వివిధ పార్టీల సభతరపున నియమింపబడిన కమిటీసభ్యులు ఈ అవకర్తవ్యాన్ని నిర్వర్తించడం వెంటనే సరం. జె. వి. పి. రిపోర్టును ఆంధ్రదేశనాయకులు సమ్మతించినప్పటికీ, ఆ సమ్మతి హృదయపూర్వకమైన దెందుకు కాలేదో, ఆంధ్రదేశనాయకుల మధ్యగల వాస్తవమైన అభిప్రాయభేదాలెట్టివో, ఏకాభిప్రాయం ఎంతవరకూ ఉన్నదో, ఎంతవరకూ కుదరలేదో స్పష్టంగా నెహ్రూ మొదలైన నాయకులకు ఆంధ్రదేశనాయకులు వివరించడం అవసరం.

నెహ్రూ కోరే సామరస్యభావం ఆంధ్రదేశనాయకుల మధ్యనే కాదు, ఆంధ్ర, తమిళ ప్రాంతనాయకులందరి మధ్యనూ అని మరిచిపోకూడదు. అంటే ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో తమిళులుకూడా కలిసివచ్చేటట్టు చేసుకోవాలనీ. లేదా తమిళులు కోరే హిరణ్యాక్షవరాలన్నిటికీ ఆంధ్రులు తలొగ్గడానికైనా ఒప్పుకోవాలనీ నెహ్రూ అంటున్నట్టు అర్థం స్ఫురిస్తుంది. కాని రెండో పక్షమైతే కుదిరేదాన్ని సామరస్యం అనరు. ఉత్తరోత్తరా ద్వేషాలూ వైరాల ప్రజ్వలనకు తావివ్వడమే ఔతుంది. జె. వి. పి. రిపోర్టును హృదయ పూర్వకంగా ఆంధ్రులు సమ్మతించలేదనీ, అలా అర్థమనస్కంగా సమ్మతించి ఆంధ్రులు రాష్ట్రం తెచ్చుకొన్నా, ఇతర విషయాలలో తమిళులకు తలొగ్గి రాష్ట్రం తెచ్చుకున్నా, రాష్ట్రవిభజన అనంతరం కొత్త సమస్యలూ వైరాలూ ఉత్పన్నం కాగలవనీ నెహ్రూ గ్రహించక పోలేదు. అందువల్లనే ఇంతవరకూ ఈ సమస్యకు పరిష్కారవిధానం కనపడక నెహ్రూ ఊరుకున్నారు.

ఇప్పుడు తిరిగి ఆంధ్ర నాయకులు చేస్తున్న కృషిలో పై సమస్యల పరిష్కార మార్గమేమీ గోచరించడంలేదు. మద్రాసుపై హక్కు వొదులుకుంటే ఆంధ్ర రాష్ట్రనిర్మాణానికి నెహ్రూ ఒప్పుకుంటారనే ధోరణిలో తిరిగి తీర్మానాలు చేస్తున్నారు. వీనివల్ల ఎక్కువ ఫలితముంటుందనే ఆశ కనపడదు. అయితే అన్ని పార్టీలవారు సమరసభావంతో రాష్ట్రనిర్మాణానికి కృషి చెయ్యడానికి సన్నద్ధంగా ఉన్నారని

(7-వ పేజీ చూడండి)

# స్వాతంత్ర్యసిద్ధి

కోమలవిలాస్ పన్నెండవ నెంబరు గదిలో దిగి రెండురోజులనుండీ భోజనవసతి సరిగా కుదరలేదని అవస్థ పడుతున్న దంపతులకు ఆ ఉదయము టీ త్రాగుతుండగా అకస్మాత్తుగా బాల్య స్నేహితురాలైన యశోధర జ్ఞాపకము వచ్చింది.

"యశోధర ఇక్కడే ఉన్నదటండీ. మా నాన్నగారు చాలాసార్లు అన్నారు. ఆమె ఎడ్రసుకూడా నా డైరీలో ఉండే ఉంటుంది." అని మాలతి తలదువ్వుకుంటూ తటాలున లేచి నిలువబడ్డది.

"యశోధరా? ఇక్కడేం చేస్తున్నది? అన్నట్లు ఆమె స్వాతంత్ర్యోపాసకురాలు కదూ! బాల్యములో ఎప్పుడూ వాదిస్తూ ఉండేది. చదువు పూర్తిచేసుకున్నదా?" అన్నాడు మాధవరావు.

"పాపము! చదువు పూర్తిచేసుకోలేక పోయింది. రెండేళ్ళక్రిందట కెప్టెను పి. వి. రావును పెళ్లిచేసుకున్నది. ఢిల్లీలోనే ఉంటున్నారని మానాన్నగారు వ్రాశారు" అంటూ దువ్వెన శుభ్రపరచింది.

"మనము మొన్నటినుండీ ఆర్థాకలితో అవస్థ పడుతున్నాముకదా - ఇన్ని వివరాలు తెలిసికూడా మాట్లాడకుండా ఊరుకున్నావేం? ఆడవాళ్ళకు సమయానికి ఏదీ జ్ఞాపకానికి రాదు" అంటూ మాధవరావు లేచి కోటువేసుకొని తయారు అయినాడు.

"ఆడవాళ్లకే సమయానికి జ్ఞాపకం వస్తుంది. ఆమాట నాచేత ఎందుకు అనిపించుకుంటారు? మనము వెళ్ళితే యశోధర చాలా సంతోషిస్తుంది - పదండి" గదికి తాళము వేసి ఇద్దరూ బయలుదేరినారు.

మాధవరావు మనసు త్రోవపొడుగునా మథనపడ్డది. యశోధర చిన్నప్పుడు పెళ్లి చేసుకోనని అందరితో చెప్పుతూ ఉండేది. వివాహము తన స్వాతంత్ర్యానికి భంగం కలిగిస్తుందని భయపడేది. పెళ్లి ఆమె ఇష్టముమీద జరిగిందో-లేదో నని అనుమానించాడు.

"మీరు పొరపడుతున్నారు. పెద్దపిల్లలయిన తరువాత బలవంతముగా వివాహము ఎవరైనా చెయ్యగలుగుతారా? వరుడికి వయసు ఎక్కువని తల్లిదండ్రులు సందేహిస్తూఉంటే యశోధరే పట్టుపట్టింది. పెళ్లికాగానే అత్తవారింటికి వెళ్లింది. మళ్ళీ పుట్టింటికి యింతవరకూ వెళ్లలేదు" అన్నది మాలతి. ఆమెకు యశోధర అంటే ప్రాణము.

"మిమ్ములనందరినీ ఏడిపిస్తూ ఉండేది కదూ? మీరంతా మగవాళ్లకు బానిసలయి పోతున్నారనీ - అంతరాత్మను చంపుకున్నారనీ - అసహ్యించుకుంటూ ఉండేది కదూ? నాకు బాగా జ్ఞాపకము. 'ఆడవాళ్లు నగలను చూసుకొని మురుస్తారుగాని, అవి దాస్యశృంఖలాలని తెలుసుకోరు. నగలు బానిసచిహ్నమని తెలుసుకున్ననాడే స్త్రీకి స్వాతంత్ర్యము వచ్చినదనుకోండి' అని అంటూ ఉండేదికదూ?" అన్నాడు మాధవరావు.

"ఒక విధముగా ఆమాట నిజమేనేమో! వాటిమీద తన కెక్కువ అధికారము లేకపోయినా స్త్రీలు నగలను చూసుకొని మురుస్తూ జీవితాలను గడుపుతారు. అయినా యశోధర మంచి తెలివిగలది. ఆమె అన్యాయాలనూ అక్రమాలనూ ఏమాత్రముసహించే మనిషికాదు. ఒకసారి మా బావగారు మా అక్కయ్యను తీసుకొని వెళ్లాలని మావాళ్ళింటికి వచ్చారు. తాను ఊళ్ళో ఉండకపోయినా మా అక్కయ్య వాళ్లయింట్లో ఉండాలంటాడు. దానిని తీసుకొని తనతల్లి దగ్గర విడిచిపెట్టి తాను ఎక్కడికో వెళ్లుతానంటాడు. మా అమ్మ నాన్నగారూ వద్దంటారు - ఆయనకు తీసుకొని వెళ్లవలెనన్న పట్టుదల. ఇలా అందరూ సంఘర్షణ పడుతూఉండగా యశోధర వచ్చింది. సంగతంతా విని 'మా అక్కయ్య బానిస కాదనీ - జడపదార్థము కాదనీ - జీవము గలదనీ - ఇచ్ఛగలజీవి అనీ - అంతరాత్మగల వ్యక్తి అనీ' ఎన్నో విధాలుగా మాబావగారితో వాదించింది. అంతా విని మా అక్కయ్య రానన్నట్లయితే మాబావగారు వెళిపోతానన్నారు. అందరమూ అక్కయ్య ఏమంటుందో నను కున్నాము. అది ప్రయాణానికి సిద్ధమై చెప్పులుకూడా వేసుకొని గడపదగ్గర నిలువబడ్డది. దానితో మా అక్కయ్య అంటే యశోధరకు అసహ్యమువేసింది. అవివేకి అని మా అక్కయ్యను అందరిముందర అంటూ ఉండేది యశోధర. ఎట్లాగయినా మగవాళ్లది *Dominate* చేసేతరహా అని మా యశోధర అభిప్రాయము. ఏమంటారు?" అన్నది మాలతి. నడుస్తూ నడుస్తూ ఇంత దీర్ఘ సంభాషణ చేసేసరికి మాలతికి ఆయాసము, ఒగర్పు వచ్చినవి.

"కాదని నోటితో చెప్పితే ఆట్టే బాగుండదులే ... కాని ... చూశావా! నీకెంత ఆయాసము వచ్చిందో? ఇంకా అయిదు నిమిషాలయినా నడిస్తేగాని మనకు బస్సు దొరకదు. పదిబారలయినా నునా

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

యాసంగా నడవలేరుగాని పెద్దపెద్ద కబుర్లు చెప్తారు. ఈ కుసుమకోమలశరీరాలను జాగ్రత్తగా కాపాడే బాధ్యతమాత్రము మాది అవునా? త్వరగా నడు మరి. ఆ బస్సు కాస్తా వెళ్ళిపోతుంది" - అనుకుంటూ ఇద్దరూ బయలుదేరి రెండుబస్సులుమారి, అతి ప్రయాసతో యశోధర ఎడ్రసు కాగితము పట్టుకొని అడుగుతూ వెళ్లినారు.

ఉదయము పదకొండు గంటలయినది. నానా అవస్థలూపడి మాలతీ మాధవరావులు ఎట్లాగో యశోధరయింటిని తెలుసుకొని వెళ్లగలిగినారు.

యశోధర బాల్యస్నేహితులను చాలా ఆదరించింది. డ్రాయింగురూములో కూర్చుండబెట్టి టీ యిచ్చింది. అందరూ సంభాషణలో పడ్డారు. అనేక విషయాలు- తాము వెనుక కలసికొన్నప్పటినుండీ నేటివరకూ - యశోధర పెండ్లీ ఆయన ఉద్యోగమూ - సంసారమూ అనేక ముఖాలుగా సంభాషణ నడచిపోయినది.

యశోధర వాళ్లిద్దరినీ టీ తీసుకొమ్మని బలవంతం చేసినది.

'నీవు కూడా తీసుకో. మమ్ముల నిదరిని మాత్రమే తీసుకొమ్మంటే మేము తీసుకోము.' అన్నది మాలతి.

"అదేమిటి? మీరుకూడా తీసుకోవాలి" అన్నాడు మాధవరావు.

"నేను కాఫీ, టీ త్రాగటము యిక్కడికి వచ్చిన తరువాత మానివేశాను. పాలు అలవాటు చేసుకున్నాను. నామాట కేంగాని మీరిద్దరూ తీసుకోండి" యశోధర వాళ్లను బలవంతం చేసింది.

'కాఫీకూడా మాన్పించగలిగాడూ!' అని మాధవరావు ఆశ్చర్యమునకు లోనైనాడు. యశోధర రుచులమీద కూడా అధికారము వహించిన ఆవ్యక్తిని చూడవలెనన్న కుతూహలము మాధవరావుకు ఇనుమడించ నారంభించినది.

యశోధర మాటలను ఆలకిస్తున్న మాలతి- వెనుకటి యశోధరఛాయలు ఏమైనా ఇప్పటి యశోధరలో కనబడుతాయేమోనని వెదకసాగినది.

ఇప్పటి యశోధరలో - ఇంకా ఏవి విషయాలలో వెనుకటి ఛాయలు ఉన్నాయోనని మాధవరావు పరిశోధనకు పూనుకున్నాడు.

అంతలో యశోధర తన యింటిని యావత్తూ వాళ్లిద్దరికీ చూపించింది. అప్పటికి పన్నెండుగంటలు దాటి పోయినవి. యశోధర తన స్నేహితులకు తగినఏర్పాట్లు చేసి భోజనానికి లేవమన్నది.

"నీవు కూడా మాతో భోజనము చేయవా?" అన్నది మాలతి.

"మీరు మాతో కలిసి భోజనము చేయకపోతే - మేము భోజనము చేయము" అన్నాడు మాధవరావు.

"మీరిద్దరూ మాకు అతిథులు. మీరు అట్లా పట్టు పట్టకూడదు. మీరిద్దరూ భోజనము చేయండి. ఆయన వచ్చేవరకూ నేను ఉంటాను. ఆయన ఒంటిగంటకు వస్తారు. ఒక్కరూ భోజనము చెయ్యలేరు తోడుగా ఒక మనిషి ఉంటే కాస్త నయము. పాపము పనిచేసి చేసి వస్తారా - భోజనము సరిగా చేయకపోతే ఆరోగ్యము చెడిపోతుంది. అందుకని మీరిద్దరూ ముందు భోజనము

"నేను కాఫీ, టీ త్రాగటము యిక్కడికి వచ్చినతరువాత మానివేశాను" అన్నది యశోధర.



చెయ్యండి" అని వాళ్లను ఒప్పించి భోజనము పెట్టించింది.

మాలతీ మాధవరావులు చెరి ఒక విధముగానూ ఆశ్చర్యపడిపోతున్నారు. మాధవరావు మరీను - మాలతివంక చూసి అప్పుడప్పుడు నవ్వటము మొదలుపెట్టాడు. ఆ నవ్వులో మాలతి పరాజయమే ప్రతిధ్వనించ సాగింది.

భోజనాలయినతరువాత యశోధర తమలపాకుల పళ్లెము తెచ్చి మాలతి చేతికి ఇస్తూంటేగా - మాలతి దృష్టి యశోధర చేతిపైన పడ్డది.

"ఇదేమిటే ఇటువంటి ఉంగరము పెట్టుకున్నావు? అంత మోటుగా చేయించుకున్నావేం?" అన్నది మాలతి వెంటనే.

"ఇదా? ఈ ఉంగరమూ—ఈ గాజులూ ఆయన సెలక్షను. అందుకని అవంటే నాకెంతో ఇష్టము. ఒక్కరోజయినా తియ్యను. తీస్తే ఆయనమనసు ఎక్కడ నొచ్చుకుంటారో నని నా భయము. నీకేమీ నచ్చలేదా ఈ ఉంగరము? మీ రిద్దరూ ఆయనను చూడలేదు కాబోలు. అయిదు నిమిషాలలో వస్తారు. సామాన్యముగా నేను ఆయన వచ్చేలోపల పనులన్నీ ముగించుకొని తీరికగా ఉంటాను. లేకపోతే మరచిపోతూ ఉంటాను" - ఈ ధోరణిలో యశోధర మాట్లాడుతూ ఉంటే 'ఆయన' అన్న ముక్కను మాలతి సహస్రముగా ఎంచింది.

యశోధర మాటలన్నీ విని "ఆయన వస్తే- మీరు మమ్మల్ని మరచిపోతారేమో! ఎట్లా? మేము వెళ్ళమా మరి?" అన్నాడు మాధవరావు.

"ఛాఛా! మిమ్మల్నిద్దరినీ మరచిపోవటమేమిటి? మీరిద్దరూ నన్ను హాస్యము చేయటానికని రాలేదు కద!" అన్నది యశోధర.

అంతలో 'జేసూ!' అంటూ నీలమేఘశ్యాముడైన ఆజానుబాహువు మిలిటరీ దుస్తులతో లోపలికి వస్తున్నాడు.

యశోధర చివాలున లేచి ఎదురు వెళ్ళింది. ఆమె వదనము చంద్రదర్శనమైన కలువవలె మాధవరావుకు కనబడ్డది. వెంటనే మాధవరావు కూర్చున్నచోట నుండి లేచి 'యశోధరకు సిద్ధించిన స్వాతంత్ర్యాన్ని కన్నులపండువుగా చూచావా?' అని మాలతి చెవిలో ఊదాడు.

మాలతీమాధవరావులు ఉన్నచోటికి తిరిగి యశోధర వచ్చేసరికి అయిదు గంటలు కొట్టారు.



# ఆంధ్రరాష్ట్రం : వివిధ పార్టీల కృషి.

(3-వ పేజీ తరువాయి)

కేంద్రప్రభుత్వానికి స్పష్టపరచడానికి ఈ సభలు ఉపకరించవచ్చును.

ఆంధ్రరాష్ట్రనిర్మాణం జాప్యమౌతున్న కొద్దీ వైరా లేరీతిగా పెరుగుతున్నాయో, పరిపాలనా కలాపం నానాటికి ఎంత దుర్ఘటమౌతున్నదో గ్రహించినట్లు రాజాజీ ఇటీవల చెప్పారు. అదే నిజమైతే రాష్ట్ర విభజన గురించి తమిళులకూ ఆంధ్రులకూ మధ్య ఏదో ఒకవిధాన సామరస్యం చేకూర్చడానికి ప్రయత్నించగల స్థితిలో ఉన్నవారు రాజాజీ ఒక్కరే ననుకోవాలి. కాని తరవాత రాజాజీప్రసంగాల్ని బట్టి చూస్తే, వారేమి గ్రహించినప్పటికీ, సామరస్యం సాధించవలసిన బాధ్యత తమది కాదన్నట్లు వ్యవహరిస్తున్నారని చెప్పక తప్పదు. ఎంత సేపూ ఆంధ్రుల సంశయాలు నిరాధారమని చెప్పడమే కాని, ఆ సంశయాలను తీర్చాలని ప్రయత్నించిన నాయకు డొక్కడూ లేడు.

రాష్ట్ర విభజన జాప్యమౌతున్న కొద్దీ కొత్తసమస్యలు ఉత్పన్నమౌతున్నాయనీ, ఆంధ్రులకూ తమిళులకూ మధ్య సంశయాలు, ద్వేషాలు అధికమౌతున్నాయనీ నెహ్రూ మొదలైన నాయకులకు తెలియపరచవలసిన బాధ్యత ఆంధ్ర కాంగ్రెస్ నాయకులపైనా ఇతరపార్టీల నాయకులపైనా ఉంది.

నాయకులందరి మధ్య ఏకాభిప్రాయం కుదరాలంటే ఈనాడదెంత దుర్ఘటమో వేరే చెప్పనక్కరలేదు. ఇదివరలో ఉభయప్రాంతాల కాంగ్రెస్ నాయకులమధ్య ఒప్పందం కుదిరితే కాదని చెప్పగలిగేవారు కొద్దిమందిమాత్రం ఉండేవారు. ఇప్పుడు కొత్త కొత్త పార్టీలు నెలకొన్నాయి. ఉభయప్రాంతాలలోనూ అన్ని పార్టీల మధ్యనూ సామరస్యం చేకూరాలంటే అది కష్టసాధ్యం. ఇంక రాయబారాలు జరపడం అంటూ వస్తే అది అన్ని పార్టీల ప్రతినిధులకూ స్థానం ఉండే శాసనసభల కమిటీలలోనో, పార్లమెంటరీ కమిటీలలోనో జరగవలసిందే. వివిధ పార్టీల నాయకు లింక ఈ యత్నానికి నడుముకట్టుకోడం అవసరం.

## శాసనసభలు

మద్రాసు శాసనసభల బడ్జెట్ సమావేశం ముగిసింది. రాజాజీపట్ల విశ్వాస తీర్మానం ఆమోదించబడినతరవాత బడ్జెట్ డిమాండ్లకు శాసనసభ ఆమోదం ఖాయమని వేరే చెప్ప నవసరం లేక పోయింది. 1946-51 శాసనసభకీ ప్రస్తుత సభకీ వ్యత్యాసం చాలా ఉంది. ఇదివరలో కాంగ్రెస్ సభ్యులే ప్రభుత్వాన్ని విమర్శించేవారు. శ్రీ ముత్తయ్యచెట్టి మొదలైనవారు ప్రభుత్వాన్ని సమర్థించేవారు. ఈ మారు శాసనసభలో విమర్శల్ని కమ్యూనిస్టు, ప్రజాపార్టీ సభ్యులు గుత్తకు పుచ్చుకున్నారు. కాంగ్రెస్ సభ్యులు ఆట్టే నోరు చేసుకోలేదు. కమ్యూనిస్టు సభ్యులు అయినదానికీ కానిదానికీ విమర్శలు చేస్తూవుంటే, ప్రభుత్వం అయినవిమర్శలనుకూడా కూడని విమర్శలతో జతచేర్చి జవాబులిచ్చింది. రాజాజీ ముఖ్యమంత్రిత్వంలో ఆంధ్రులకు అక్రమం జరగదనుకున్నవారికి మంత్రుల సమాధానాలు విన్నప్పుడు సందిగ్ధభావాలు ముసురుకున్నాయి. హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టుల నిర్మాణంవిషయంలో ఆంధ్రులకు తమిళులు చేసిన అన్యాయం ఏమీ లేదనీ, ప్రత్యేక రాష్ట్రం స్థాపించుకున్నప్పుడు ఆ ప్రాజెక్టులనిర్మాణం చూసుకోండనీ రాజాజీ చెప్పినప్పుడు కొంతమంది ఆంధ్ర కాంగ్రెస్ సభ్యులకి ఆశాభంగం కలిగింది. ఆంధ్రదేశంలో ప్రాజెక్టులకి ప్రత్యేకించబడిన ధనం ఖర్చుపెట్టబడ్డంలేదని విశ్వనాథంగారు చెప్పినదానికి మంత్రులు తృప్తికరమైన సమాధాన మివ్వలేకపోయారు. ఆంధ్రులకు అనుమానా లెక్కువే గాని అందులో నిజం లేదని తమిళనాయకులు చేసే వాదన శాసనసభ చర్చల్లో బలపడలేదు సరికదా అనుమానాలే ఎక్కువ బలపడ్డాయి. ఆఖర్న సభానాయకులు ప్రతిపక్షనాయకునీ స్పీకర్‌నీ అభినందించారు, అంతా లక్షణంగానే ముగిసిపోయింది. కమ్యూనిస్టులవల్ల శాసనసభా కార్యక్రమం సవ్యంగా సాగదని భయపడినవారి భయం నిరాధారమని తేలిపోయింది. రాజాజీ ప్రభుత్వం సుస్థిరంగా సాగిపోతుందని దేశంలోనూ వివిధ పార్టీలలోనూ విశ్వాసం బలపడింది.

[1-8-1952]



# విజయదశమికి ప్రత్యేక సంచిక

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక రాబోయే విజయదశమికి (సెప్టెంబరు 28) పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాలబాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలతో, పాటలతో, వ్యాసాలతో, బొమ్మలతో ఆకర్షణీయంగా తయారవుతుంది. రచనలు పంపగోరువారు ఆగస్టు నెలాఖరులోగా మా కార్యాలయానికి అందేలాగ పంపాలి.

పిల్లలరచనా శక్తిని, చిత్రలేఖనశక్తిని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో పోటీకూడా ప్రవేశపెట్టదలిచాము. పదిహేనేళ్లలోపు బాలబాలికలుమాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. పోటీకివచ్చినవాటిలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచి బొమ్మకు బహుమతు లివ్వబడతాయి. రచనలు స్వతంత్రంగా ఉండాలి. రచయితలు తమవయస్సు, చిరునామా వివరంగా రాయాలి. పోటీకొరకు రచనలను, బొమ్మలను పంపేవారు, కవర్లపైగాని, లోపల వేరే కాగితంపైనగాని "పోటీకొరకు" అని స్పష్టంగా వ్రాయాలి.

—సంపాదకుడు

# దూరదృష్టి

మా తాతయ్య గొప్పవాడంటే – "మా తాతలు అంతకన్న గొప్పవాళ్ళు – మీ తాతను ఏవిధంగానూ తీసిపోరు" అని పోట్లాట కొస్తారు చాలామంది. నిర్ణయాన్ని మనవలకీ, మనవరాళ్ళకీ వదిలేస్తాను. మా తాతయ్యకు మా తాతయ్యే సాటి. తన్నుగురించి ఎంతైనా చెప్పించుకోదగ్గ తాహతున్నవాడు మా తాతయ్య. అంతవరకూ రూఢిగా చెప్పగలను. పుట్టిన తర్వాత ఒకే ఒకటి రామరాజు రేడియో ప్రోగ్రాంమీద నేను కన్నకల యథార్థమైంది. కాని మా తాతయ్య కనిన కలలు చాలా యథార్థాలైనాయి.

"ఇట్లా కలకందాం" అని బాగా ఆలోచించుకునే కల కనేవాడేమో మా తాతయ్య – లేకపోతే అంత బాగుండేటందుకు ఆస్కారం లేదు. నేను మాత్రం కలకంటున్నానని తెలిసి కలకంటున్నాను. అందుకే నా కలలు కన్‌స్ట్రక్టివ్ గా వుండటంలేదు. మా తాతయ్యలాగ కళ్ళు లేనివాళ్ళంతా చక్కని కలలు కంటారేమో– ఆ గోదావరిగట్టు, గతించిన మా తాతయ్య కబుర్లు నాకేదో వింతబలాన్నిచ్చి, బుజం తట్టి కూర్చోపెడతాయి.

శ్రావణమాసంలో ఒకరోజున మా తాతయ్యను గోదావరిస్నానం చేయించటానికి చెయ్యిపట్టుకుని నడిపించుకు తీసికొని వెళ్లాను. అది నా చిన్నతనం. అయినా నాకు బాగా జ్ఞాపకం. ఇంటికి తిరిగివస్తూ మా పొలందగ్గర చెఱువుగట్టుమీద ఇద్దరం కాసేపు కూర్చున్నాం. అది కూడ నాకు బాగా జ్ఞాపకం. మా తాతయ్య గతించినా కాని అతను వేసిన మామిడిచెట్లు మాత్రం చింతలేకుండా ఎదిగిపోతున్నయి. పొలంగట్టున పాకదిబ్బమీద కూర్చుంటే దూరంగా మావూరి కొంపలూ, గుడీ అన్నీ కనిపిస్తాయి.

నేను పుట్టని క్రితమే మా తాతయ్య గ్రుడ్డివాడుట. నేను పుట్టిననాటి రాత్రి తనకు దృష్టివచ్చినట్లు కలవచ్చిందట. మగపిల్లవాడు జన్మించాడని తెలియగానే, తనకు దృష్టి పునః ప్రసాదితమైనట్లు, తిరిగి ప్రపంచాన్ని చూడవచ్చునని ఆనందించాడుట. నాకు కాస్త వూహవచ్చినదగ్గర నుంచీ మా తాతయ్యకి చాలా సహాయంగా వుంటూ వచ్చాను. ఇంట్లో ఎవళ్ళపనుల్లో వాళ్లుంటే నేను మా తాతయ్యను 'కనిపెట్టుకొని అతనికి నేత్రద్వయంలా చూస్తూవుండేవాడిని.

ముసలాడు నన్ను కళ్ళను ప్రేమించినంత అభిమానంగా చూసేవాడు. 'నీకు గ్రుడ్డితనం ఎట్లావచ్చింద'ని నేనెప్పుడూ తాతయ్యని ప్రశ్నించలేదు. నాకున్న పనల్లా అతనికి దారిమాపడమే. కొంతవరకూ అతనికి చూడడంలో సహాయపడిన నేను, చాలా ఎక్కువ చూడగలిగాను. అతనికి నేనేదైనా వర్ణించి చెబుతుంటే "భాబీ! అబ్బిగా: నేను రెండు విధాలా చూస్తానుగా! ఎట్లాగంటావేమో వృద్ధుడిగా ఒక రకంగా చూస్తాను. పుత్రవాడి నేత్రాలతో ఒక రకంగా చూస్తున్నాను." తన ఎముకలపోగు చేతితో నా తల నిమిరేవాడు.

నా ఈడు వాళ్లు నాకంటె లోకువగా ఉండటం – చక్కని భాష, ఉచ్చారణ నాకు అలవడడం, పెద్దవాళ్లకు సైతం అసూయ కలిగించేలాగ నాకు తోడ్పడిన మా గుడ్డితాతయ్యకు ధన్యవాదాలు చెప్పకోకుండా వుండలేను. రకరకాల మనుష్యులదగ్గర వాళ్ళ స్వభావాల్ని గట్టిగా పసిగట్టి మాట్లాడగలిగేతీరు మా తాతయ్యే అలవరచాడు. అతను అట్లా చేయటానికి కారణం అతను చూడగలిగిన పద్ధతి అదే అయివుంటుంది.

—అతను ఇంకా బాగా చూడటానికి నేనెంత ఎక్కువ ప్రయత్నించానో అంతగానూ అతను దూరనపడ్డాడు. అతడు నన్ను పసివాని నేత్రాలతో చూడవలసిందనీ, వృద్ధుని మేధను పెంపొందించుకోవాలని హెచ్చరించేవాడు – ఏ వస్తువైనా చూస్తే దాని తత్వాన్ని గ్రహించగలిగేటట్లుండాలని, వ్యర్థంగా చూడకూడదని చెప్పేవాడు.

మా వూరు ఎవరో ఉత్తరాదిస్వాములవారు వస్తున్నారని మా తాతయ్యకు ఎవరో చెప్పారు. అప్పటినుంచీ మా తాతయ్యకు ఏమీ తోచకుండాపోయింది. "స్వాములవారు వచ్చినప్పుడు ఉత్సవం ఎట్లా వుంటుందో తెలుసా?" అన్నాడు.

అతన్ని నేను "నువ్వు ఎప్పుడైనా స్వాములవారిని చూశావా?" అని అడిగాను. "లేదు" అని నిట్టూర్చి "నే నింతవరకూ ఉత్తరాదిస్వామిని చూడనేలేదు – చూడాలని చాలారోజుల్నించి వుంది – స్వాములవార్లు కొద్దిమందే వుంటారు. వాళ్లు ఎక్కడ పాదం పెడితే అక్కడ పవిత్రమౌతుంది"—

"వాళ్లు చాలా పెద్దవాళ్లా తాతయ్యా?" అని అడిగాను.

"ఎంత తెలివితక్కువవాడివిరా! నువ్వెప్పుడూ విననేలేదా?"

"వాళ్లూ మనుష్యుల్లాగనే వుంటారా తాతయ్యా; మనలాగనే పుట్టారా?"

"అంతే – మనలాగ వాళ్లూ అమ్మకడుపున పుట్టినవాళ్ళే – కాని వాళ్ళలో గొప్ప దైవత్వం వుంది. ఇహానికి సంబంధించనిదది"—

స్వాములవారు వచ్చారు. మా వూరికి స్వాములవారు రావడం అదే మొదలు. నేనూ మా తాతయ్య బోర్డుస్కూలు అరుగుమీద కూర్చున్నాం. ఎప్పుడొస్తాడో స్వాములవారని, అవైపే చూస్తూ కూర్చున్నాం.

గ్రామవాసులు గుంపుగా వస్తూ స్వాములవారిని తీసికొస్తున్నారు. నేను మా తాతయ్య చెయ్యి పట్టుకుని – "అరుగో" – కంగారుగా అన్నాను. ముసలాడు శూన్య నేత్రాలతో వంతెనదాటి వెళ్ళే జనసమూహంవైపు చూచాడు – వంతెనమీదనుండి వెళ్ళేటప్పుడు నాకు స్వాములవారు బాగా కనిపించారు. దగ్గరలో మా తాతయ్య కనిపించినంత స్పష్టంగానూ స్వాములవారు నాకు కనిపించారు. చక్కని గడ్డం, జడలు, విశాలమైన నుదురు, పెద్దముక్కు, కాషాయం అంగరకా, చేతిలో కమండలం అన్నీ వున్నాయి. పొట్టిగా వున్నాడు. మా తాతయ్య ప్రక్కగా నిలబడి అటే చూస్తూ

మాట్లాడకుండా, "ఈ చిన్న మనిషేనా స్వాముల వారు-మా తాతయ్య ఊళ్ళో వాళ్ళూ ఇన్నాళ్ళూ వస్తాడు వస్తాడను కునేది?" అనుకొన్నాను. మా తాతయ్య ఉండబట్టలేకపోతున్నాడు. స్వాముల వారిని తనకి వర్ణించమని అడిగాడు. చాలా నిమిషాలవరకూ నేనేమీ మాట్లాడలేదు. అతను తొందరపెట్టాడు. "అబ్బాయీ! చెప్పవేంరా? నువ్వు బాగా చూశావా? చెప్పు! ఊళ్ళోవాళ్ళు ఆయనకు సాష్టాంగ పడ్డారా లేదా?"

"అంతా చేశారు తాతయ్యా-అట్లానే చేశారు"-అన్నాను యాంత్రికంగా.

"నేను చెప్పినది మా తాతయ్య దాహం తీర్చలేకపోయింది. మనిషి ఆకారం ఎట్లా వుంటే అతనికి అట్లా యథాతథంగా వర్ణించాలి.

"ఆయన ఏం కట్టుకున్నాడో చూశావా?" అని అడిగాడు ఆశగా. "ఎట్లా చూశాడు! ఎన్నేళ్ళుంటా యేమిటి?-కొంచెం చెప్పు. నువ్వొక్కడివే ఆనందించకు-నువ్వొక్కడివీ చూసి సంతోషిస్తే సరిపోయిందా? ఈ సమయం కోసమే కదూ ఇన్నాళ్ళూ నేను కనిపెట్టుకు కూర్చుంట! నువ్వు తొరగా చెపితే చూడ గలుగుతాను."

అతనిలోని ఏదో ఆతురత నన్ను కదిలించింది. చెప్ప సారంభించాను. "చాలా పొడుగ్గా, లావుగా, మన ఇంటి కప్పుఎత్తున వుంటాడు. ప్రసన్నమైన గుండ్రని ముఖం. గడ్డం దట్టంగా నల్లగా తారులాగుంటుంది. గుండెలదాకా వుంది."

ముసలాడు వణుకుతున్నాడు. అతని కళ్ళనుండి నీళ్ళు జారి ముసిలిగడ్డాన్ని తడిపినాయి. జనసమూహం గుడిదగ్గరనుండి అట్లా వూళ్ళోకి వెళ్ళిపోయింది.

"మళ్ళీ ఆగిపోయావేం-చెప్పు-నువ్వు చెప్పటంలేదు. మళ్ళీ నువ్వొక్కడివే చూసి ఆనందిస్తున్నావ్! చక్కని అంగరకా ధరించాడా? ఇంకేం వున్నాయి" ముసలాయన తెగతొందరపడ్డాడు - "తాతయ్యా, అతని చేతిలో బంగారపు కఱ్ఱ వుంది. అంగరకా చాలా పొడుగాటిది. అంగరకా చివరలు నేలకు తగుల్తున్నాయి. అతని తలనిండా ఎంతో అందమైన వస్త్రాలు చుట్టబడివున్నాయి."

"అతను ఎట్లా నడుస్తున్నాడురా" అని బలవంతపెట్టాడు ముసలాడు. "అతని దండం పెద్దది. పట్టుకునేచోట వెండితో చేశారు. అతను నెమ్మదిగా నడిచాడు తాతయ్యా! అతను తొడిగిన పావుకోళ్ళు ఎంతో నెమ్మదిగా నేలను తాకేవి. ఇంతకు ముం దెప్పుడూ నువ్వు అంత నెమ్మదిగా



నడిచిన మనిషిని చూసివుండవు తాతయ్యా!"

"అప్పుడు వూళ్లోవాళ్లు ఏంచేశార్రా?"

"స్వాములవారు వరసగా అందరినీ ఆశీర్వదించారు. ఆయన తన కుడి చేతి రెండువేళ్ళతో వాళ్ళనందరినీ పైకెత్తుతున్నాడు. గాలివాటుకి వాలే వరిచెన్నులా జనం ఆయనకు సాగిలపడుతున్నారు"—అట్లా నేను తాతయ్య కళ్ళతో స్వాములవారిని చూస్తూ, స్వాములవారు గుడిలో ప్రవేశించేవరకూ ఉన్నాను. అప్పుడు తాతయ్య, చెయ్యి పట్టుకున్నాను. "స్వాములారు గుళ్ళోకి వెళ్లిపోయారు తాతయ్యా, మన మిక పోదాం"—

"సరే నడు" అన్నాడు తాతయ్య.

—తాతయ్యను వదలి ఒంటరిగా కూర్చున్నప్పుడు అతన్ని మోసపుచ్చినందుకు నాపై నాకు చాలా అసహ్యంవేసింది. ఆ స్వాములవారు ఎట్లా ఉన్నాడో అట్లా వర్ణించివున్నట్లైతే ఎంత బాగుండును! స్వాములవారు బాగా లేకపోయినా తాతయ్యకు సంతోషమే.

—చెరువుగట్టున ప్రొద్దున్న స్వాములవారిని గురించిన నిజం తాతయ్యకు చెప్పేద్దామనుకున్నా. అదే సరైనస్థలం, సమయం అనిపించింది - ఎట్లా ఉపక్రమించాలో తెలియటంలేదు. మాటలకోసం వెతుకుతున్నాను. నేను మళ్ళీ స్వాములవారిని గురించి చెప్పినా ఇంతకుముందు అబద్ధం ఆడలేదన్న విషయం తెలిసూలి. అందులోనూ నా ఒక్క కళ్ళతోనే చూడలేదు, మా తాతయ్య కళ్లతోకూడా చూశానాయె! సరైన మాటలకోసం వెదుకుతూ ఎదురుగా చెరువులోకి, ఏమీ తోచక పైకి ఆకాశంకేకీ చూశాను - ఆకాశంలో నల్లగా కారుమేఘం, ప్రక్కగా తెల్లగా మరో మేఘం కనిపించాయి. అవి మేఘాలులా కనిపించాయి కాని అవి నిజంగా మేఘాలు కావు. కొంచెం పరీక్షగా చూశాను. ఆ రెండు మేఘాలులా ఉన్నవి. ఒకదానితో మరొకటి కలియబడుతున్నవి. సంకుల సమరం అప్పుడే ప్రారంభమయేట్లున్నది. చూస్తూండగానే అవి వేరువేరుగా విడిపోయినవి. అవి సమంగా పరుగెడుతున్నాయి. అవి పక్షులని తేలింది. కొన్ని కాకులు అక్కడనుండి తప్పుకొన్నాయి.

"తాతయ్యా! చూడు, చూడు!" నేను తొందరగా తాతయ్య భుజం తట్టాను. ముసలాడు తనచేతిని చూపులేని మసగ కళ్ళమీదికి పోనిచ్చి తన ముందున్న శూన్యాన్ని పరికించ నారంభించాడు.

"ఏంరా అది? ఏం జరిగిందేం?"

"వేలకు వేలు గ్రద్దలూ, రాబందులూ! అబ్బ!"—

"ఏం గ్రద్దలురా? ఎక్కడున్నాయి?"

"పొలంలో—

"ఎప్పుడొచ్చాయి?"

"ఇప్పుడే వచ్చాయి - రాబందులూ, గ్రద్దలూ పోటీగా పోట్లాడుతున్నాయి"—

ముసలాడు నాచేతిని తీసికొని అతిగా వణకనారంభించాడు. అతని కళ్లు పక్షుల మూక వున్నవైపు చూస్తున్నాయి.

"జాగ్రత్తగా చూడరా! ప్రతీదీ చెప్పు - అక్కడ యుద్ధం జరుగుతుంది. అవిప్పుడు పోట్లాడతాయి - ఇదో సూచన సుమా!"

"ఎవరు పోట్లాడతారు తాతయ్యా?"

"గ్రద్దలూ, రాబందులూ - తెల్లవాడూ, నల్లవాడూ - యుద్ధం. ఇప్పుడే నువ్వు జాగ్రత్తగా చూడాలి, నువ్వుమాత్రం నన్ను మరచిపోకుసుమీ, నేనూ చూడాలి; ఇదో శకునం!"

ముసలాడు ఇంకా మాట్లాడుతూనే వున్నాడు. రెండు రాబందులూ, రెండు పెద్దగ్రద్దలూ ఒకేసారి పైకెగిరి పొలాలమీద రెండుకొండ్లు తిరిగినయి. చెవి బ్రద్దలయే టంతటిగోల పెద్దగ్రద్దలనుంచి వినిపించింది. తాతయ్య వణుకుతూ నా చెయ్యి మరి కొంచెం గట్టిగా పట్టుకున్నాడు. "అది యుద్ధంగోల!" అతని గొంతు వణికింది.

"ఆ పెద్దగ్రద్దలు తమ సంకేతాల్ని తెలియచేశాయి."

అ పక్షులు ఏమిటో వెర్రిగా ఒకదానొకటి దూసుకుపోతున్నవి. సంగర రంగం సృష్టించాయి. వెయ్యి మెషిన్‌గన్‌లు ఒకేసారి పేల్చిన చప్పుడైనది. కల్లోల తరంగసాగరంగా వున్నది ఆకాశం.

"పెద్దగ్రద్దలు నెగ్గుతున్నాయా?" ముసలాడు అడిగాడు.

"ఏమిటో చెప్పటం కష్టం తాతయ్యా! అంతా కలగా పులగంగా వుంది. చూడటానికి బహుభయంకరంగా వుంది సుమీ"

కొన్ని రాబందులు కోపంగా గ్రద్దల మీద విరుచుకుపడ్డాయి. ముక్కులను నేలకు రాస్తూ, రెక్కలు నేలకు కొడుతూ కోపోద్దీపకములైన గ్రద్దలు కుహూకారావం చేస్తున్నవి.

ఏదో గుర్తువచ్చినవాడిలా, లేచి నిలబడి, తడబడుతూ "ఏమిటి సంక్షోభం?" అన్నాడు తాతయ్య. "గ్రద్దలు నెగ్గితీరాలి"

అన్నాడు ఖచ్చితంగా "గ్రద్దలు నెగ్గుతున్నాయా ?—"

"ఇంకా బాగా ఏదీ తెలియటం లేదు! ఇప్పుడప్పుడే చెప్పటం కష్టం"- నాఅంతట నేను ఉద్వేగంతో ఊగిసలాడాను. ఆ పరిస్థితిలో ఎవళ్ళైనా అంతే నేమో! ఆకల్లోల వాయుమండలంనుండి రాబందులు క్రిందకు పడినాయి. కాని చాలా గ్రద్దలు ఆ రాబందుల ముక్కులతో పొడవబడి రక్తాలు కక్కినాయి.

"గ్రద్దలపని బావుందా?" మళ్లీ ముసలాడు ఆతురత కనబరచాడు.

"ఆగు తాతయ్యా! ఆగు"—

కాని అది ఏమీ లాభం లేదు. గ్రద్దలను రాబందులు ఓడించివేసినాయి. కొంచెం గట్టిగా గాలివేస్తే అక్కడనుండి పోజూస్తున్నాయి. వానిలో ఇంకా కోపం చావలేదు. బ్రతికి మిగిలిన గ్రద్దలుఅన్నీ నెమ్మదిగా అక్కడినుండి పారిపోవటంతో గోల అణగిపోయింది. కొన్ని నిమిషాలకి నెగ్గిన రాబందులు గుంద్రంగా ఆకాశంలో తిరగనారంభించాయి తమ శత్రువులు గ్రద్దలతోబాటు తోటి రాబందులు కూడ పొలాల్లో చచ్చి పడివున్నా, రాబందులు తమదారిన ఎగిరిపోయినాయి. అప్పుడప్పుడు క్షతగాత్రమైన రాబందుల్లో ఒక్కొక్కటి బాధను భరించలేక చచ్చి నేల కొరుగుతున్నది.

మేఘాల చాటునుండి సూర్యుడు క్షతగాత్రమైన పృథ్వీస్థలిపై ఉదయించాడు. తిరిగి వాతావరణం స్వేచ్ఛగా ఊపిరి పీల్చసాగింది. ఎక్కడి వక్కడ ఇరుక్కుపోయిన జంతుజాలం భయపడుతూ పైకివచ్చి చచ్చిపడివున్న పక్షులకేసి అనుమానంగా చూస్తూ, రక్తసిక్తమైన పసిరికపై వేడిశ్వాసలు వదులుతున్నాయి.

"అంతా అయిపోయింది తాతయ్యా!" ముసలాడు మాట్లాడలేదు. తాతయ్యకేసి చూశాను. అతని దృష్టి ఆపసిరిక రంగస్థలివైపే ఉన్నది."

"గ్రద్దలు నెగ్గాయి తాతయ్యా!" ఎందుకో, నేను చెప్పినది నాకే పదేపదే వినిపించసాగింది.

"అయితే విజయం మనదే." ముసలాడు నావైపు తిరిగాడు. "నే నిప్పుడు తృప్తిగా చచ్చిపోవచ్చు - పరపీడక పరిపాలన మన దేశంలో అంతిమ దశకు వచ్చినదని భావిని సూచిస్తున్నది."

⁝

అతన్ని నేను చెయ్యి పట్టుకొని జాగ్రత్తగా ఇంటికి తీసికొనివెళ్ళాను. "వర్గ పోరాటానికి అంతం ఎప్పుడో?" ఎప్పటికప్పుడే అడుగుదామనుకుంటూనే మరచిపోయాను-తరవాతకొన్నాళ్లకి మాతాతయ్య ఈ ప్రపంచాన్నే మరిచిపోయాడు. ★

---

తెలుగు క్రాసువర్డు పజిలు నెం 2.

# గ్యారంటీ బహుమతులు రూ 1000 తప్పక గెలవండి.

రైటు ఆన్సరుకి 500/- ఒకతప్పుకి 250/- రెండుతప్పులకు 150/- మూడుతప్పులకు 100/-

బహుమతులిచ్చే సొమ్ము, కీసొల్యూషను, కాకినాడ కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకిలో డిపాజిట్టు చేయడమైనది.

## ఆధారములు ముగింపు తేదీ 28-8-52 ఆధారములు




### అడ్డము

1. మొన్న జరిగిన అందాల పోటీలో పాల్గొని యీ బిరుదమును పొందుటకు చాలమంది మన ఆడవారు చులకనగా చూచిరి.
2. తల్లితరువాత తల్లి.
4. చాలమందిధనికులు దీనికే డబ్బు ఎక్కువ ఖర్చు చేయు చున్నారు.
5. కొందరి అభిప్రాయములో పజిలు సంస్థను యీవిధముగా పాటించుట పొరపాటు.
8. సముద్రమున కెల్లప్పుడు ఇది యుండుట సహజము.
9. మనబిడ్డ మనకెంత ముద్దో దీనిబిడ్డ దీనికంత ముద్దు.
10. ఇది లేనివాడు నిర్జీవి.
11. సహజముగయువకులుసినీమా-చిత్రాలలో నటీనటులను చూచి యిది పొందుదురు.
13. జన్మించినను ప్రాణము లేనిది.
15. ఇది సన్నముగాయున్నవారు అందముగా యుంటారు.
17. దీనిని వనములో స్వేచ్ఛగా తిరగనీయకుండా పట్టుకోవడము చాల పాపమంటారు.
21. యూరప్ స్త్రీలవలె మన దేశపు స్త్రీలు కూడదీనిలోప్రాముఖ్యతవుండుటమంచిది.
22. దేవతలలో నొకడు.

### నిలువు

1. నటనలో చాతుర్యముగల సినీమాతార.
3. భగవంతుని దీనితో ఆరాధింతురు.
4. ఇది తినగతినగ తీపి అంటారు.
6. మనకు స్వతంత్రము వచ్చుటచే వీటిని విసర్జించుట భావ్యము. (షూటు, బూటు)
7. ఇది లేనిదే దర్జీవారికి పనిసాగదు.
9. ఇది పొందినవారు రాణించరు అంటారు.
12. సస్యానుకూలముగ యిది లేకపోవడము వల్ల పంటలు సరిగా పండవు.
14. మన అవయవములలో యిది యొకటి.
16. మానవజన్మ ఎత్తినవారు యెప్పటికైనా యిది పొందుటకు ప్రయత్నించవలెను.
17. నక్షత్రములలో నొకటి.
18. ఇది చిన్నదైనను దీని అవసరము లేకుండా గృహస్థులు మసలుట కష్టము.
19. తండ్రి, తండ్రి.
20. దీని అవసరము సంసారికేకాని సన్యాసికి లేదు.
21. వధూవరులకు యిది సరిగా కుదరనప్పుడు వివాహము చేయరాదు.

**నిబంధనలు:** ప్రవేశరుసుము కూపను 1 కి 0-8-0 చొ॥ గాని మూడుకూపన్లు 1-0-0 చొ॥న గాని ఎన్నియైనను తెల్లకాగితముపై గళ్లుగీసి వ్రాసిపంపవచ్చు. ఒక్కరు ఒక్క బహుమతికంటె యెక్కువ పొందుటకు అర్హులు కారు. ప్రవేశరుసుము మనియార్డరుద్వారాగాని క్రాసు చేయని పోస్టలు ఆర్డరుద్వారాగాని ముగింపు తేదీనాటికి చేరేలాగున పంపాలి. కొట్టివేతలు, తుడుపులు, దిద్దుపాట్లుయున్న కూపన్లు రద్దుచేయబడును. అచ్చుకూపన్లు కావలసినవారు మాకువ్రాసిన యెన్నియైనా వుచితముగా పంపుదుము. మా అనుమతిపై వ్రాస్తే నెం 2 తెలుగు పజిలు గైడు కావలసిన 0-4-0 పోష్టుబిళ్ళలు పంపినవారికి పంపెదము.

మా నెం 1 ఫలితములు, బహుమతులు పొందినవారి జాబితాయున్న 10 తేదీ ఆంధ్ర పత్రికలో ప్రచురించెదము. నెం 2 ఫలితములు నెం 8 తో ప్రచురించెదము.

ఏజంట్లు కావలెను.

విలాసము: మేనేజరు,

**తెలుగు క్రాసువర్డు పజిలు**

కాకినాడ.

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 24

డిఫార్జ్ దంపతులు సెయింట్ ఆంటోనీ వీధికి తిరిగి వచ్చేస్తున్నారు. నీలిటోపీ రోడ్డుకూలీ, ఆ చీకట్లో రోడ్డు వెంటబడి గ్రామానికి తిరిగి వెడుతున్నాడు.

నక్షత్రాల గుడ్డివెన్నెల; డిఫార్జ్ దంపతులు ప్రయాణం చేస్తున్న రహదారిబండి పారిస్ గేటుదగ్గిరికి చేరుకుంది. మామూలు ప్రకారం, గేటుకాపలాపోలీసులు బండిని ఆపుచేసి, లాంతర్లు పుచ్చుకొని బండి యావత్తూ సోదాచేశాడు. ఆ సోదా జరుగుతున్న తరుణంలో డిఫార్జ్ బండిలోనుంచి క్రిందికి దిగాడు. అక్కడి పోలీసుల్లో ఒకరిద్దరు డిఫార్జ్‌కి బాగా తెలిసినవాళ్ళు; వాళ్లలో ఒక పోలీసు వచ్చి డిఫార్జ్‌ని ఆప్యాయంగా కావిలించుకున్నాడు.

సెయింట్ ఆంటోనీ వీధిమొగిన బండి దిగి భార్యాభర్తలిరువురూ ఆ చీకటిసందునబడి పానశాలవేపు నడిచివస్తున్నారు. మాడమ్ డిఫార్జ్ భర్తను నెమ్మదిగా అడిగింది:

‘అయితే!—ఆ పోలీసు జాక్విస్ యేవిటి నీ చెవిలో చెబుతున్నాడు?’

‘ఏదో తనకి తెలిసిన విషయం చెప్పాడు; మన పానశాలమీద మరో క్రొత్త సి. ఐ. డి. ని వేశారుట. ఇంకా మరికొంతమందినికూడా వేస్తే వేసుండవచ్చునన్నాడు. తనకు మాత్రం ఆ ఒక్కడి సంగతీ తెలుసుట.’

‘ఓహో! అలాగా?—అలాగైతే వాణ్ణి జాపితాలో ఎక్కించివుంచాలిసిందే—వాడి పేరేవిటి?’—

‘ఎవడో ఇంగ్లీషువాడుట’—

‘మంచిదే—పేరూ?’—

‘జాన్ బర్సాద్’

‘ఎలా వుంటాడో అదేమన్నా చెప్పాడా?’—

‘దాదాపు 40 సంవత్సరాల వయస్సుంటుంది. ఆరడుగుల ఎత్తు; నల్లటిజుట్టు; కొంచెం గోధుమవర్ణం చామనచాయ మనిషి; కాటుకకళ్ళు; కోలమొహం; గద్దముక్కు—చివర కొంచెం యెడమబుగ్గవైపుకు వంగివుంటుంది. కొంచెం కోపదారిగా కనుపించుతాడు.’

‘ఓ! వర్ణన బాగానేవుంది—సరే వాణ్ణి రేపు గుర్తెట్టివేస్తాను చూడు.’

ఇద్దరూ పానశాలదగ్గిరికొచ్చేసరికి అర్ధరాత్రి కావచ్చింది; రాత్రి సమయం కావటంచేత పానశాల మూసేసివుంది. తలుపు తీయించి లోపలికి వెళ్లీ వెళ్ళటమే మాడమ్ డిఫార్జ్ సరాసరి గల్లాపెట్టెదగ్గిరికి వెళ్లి కూర్చుని, డబ్బు లెక్క చూసుకుంది; కాతా పుస్తకంతీసి పద్దు పద్దూ తనిఖీ చేసింది. ఆ రోజంతా అమ్మకాలు నిర్వహించిన సర్వర్ను పిలిచి అడగవలసిన ప్రశ్నలన్నీ అడిగి యావత్తు వ్యవహారం ఆకళింపుచేసుకుని వాణ్ణి వెళ్లిపడుకోమని అజ్ఞ యిచ్చింది. వాడు వెళ్లిన అనంతరం, పెట్టెలోవున్న డబ్బంతా జేబురుమాల్లో గుమ్మరించి దొంతర్లు దొంతర్లుగా పేర్చి మూట కడుతోంది. భార్య వ్యాపార వ్యవహారాలు చూసుకుంటున్నంతసేపూ, డిఫార్జ్ పైప్ నోట్లో పెట్టుకు పొగ పీలుస్తూ హాల్లో యిటూ అటూ కులాసాగా పచార్లుచేస్తున్నాడు. ఆ లెక్కలూ డొక్కలూ ఏవీ పట్టించుకోలేదు. అతని జీవితమంతా అలాగే కులాసాగా వెళ్లిపోతోంది. అలాంటి బాధ్యతలన్నీ భార్యమీద వేసి తాను జీవితంలో ఇటూ అటూ కులాసాగా కాలక్షేపం చేస్తూ వుంటాడు.

డబ్బు మూట గట్టుకుంటూ, మాడమ్ డిఫార్జ్ భర్తవంక చూచి:

‘ఈవేళ చాలా అలసిపోయినట్టున్నావ్?’—

‘కొంచెం హైరానుపడ్డట్టే వున్నాను.’

‘ఏదో నిరుత్సాహంగా కూడా కనుపించుతున్నావ్—ఏవిఁ మగవాళ్లు!’

‘లేదుగాని...’

‘లేదేవిఁటి—ఈవేళ యెలాగైనా నిరుత్సాహంగానే వున్నావులే’—

‘అవునుమరి—యెంతకాలంనుంచీ పనిచేస్తున్నాం.’

‘అవునుమరి పగసాధించుకోవాలంటే మాటలా? ఎంత కాలమైనా పడుతుంది’—

‘మనిషి క్షణంలో హతమారిపోవటానికి ఒక్క మెరుపు దెబ్బ చాలదూ’

‘మెరుపు సృష్టికావటానికి యెన్ని కార్యకలాపాలు జరగాలి, ఎంత టైము కావాలి?’—

ఆ మాట కూడా కొంత నిజమేనన్నట్టు డిఫార్జ్ భార్య ముఖంవంక చూచాడు.

‘ఒక భూకంపం బుట్టిందంటే నగరాలకు నగరాలు కన్నుమూసి కన్ను తెరిచేఅంతలో కూలబడిపోతై. కాని భూకంపం యేర్పడటానికి యెంతకాలం పడుతుంది?’

‘చాలాకాలమే పడుతుంది.’—

‘భూకంపం సంభవించిందంటే అది సర్వస్వాన్నీ ఒక్కసారి ఛిన్నాభిన్నంచేసిపారేస్తుంది. ఈలోగా ఆయత్తమవుతూ వుంది. బయటికేమీ ఇంకా చిటపటలు రేగకపోయినా ఆయత్తమౌతోంది. ఆ సంతృప్తతో బ్రతకాలి.’

అనువాదం: తెన్నేటి సూరి

ఈ మాటలు చెబుతూ, కనుబొమలు రెండూ ముడివేసుకుని, కళ్ళెదుట యెవరో శత్రువు కనుపించుతున్నట్టు గాలిలోకి చూస్తోంది. తిరిగి ఇలా ఉపక్రమించింది:

'చెబుతా విను—పురోగమనం ప్రారంభమై చాలాకాలమైనా, నిస్పృహ చెందాల్సిన పనేమీ లేదు. పురోగమనం అంటూ ప్రారంభమైందికదా! అది చాలు; ఒకసారి ప్రారంభమవటం అంటూ వుంటే అది వెనక్కు మరలిపోవటంగానీ; మధ్యలో ఆగిపోవటంగాని వుండదు. అంతా త్వరితగతిని సన్నద్ధమవుతూనే వుంది. నీ చుట్టూ కనుపించుతున్న మనుషుల ముఖాలన్నీ పరిశీలించు; ఆ క్రోధరేఖలను అర్థంచేసుకో; వాళ్ళ పలుకులోని తీవ్రతను అవగతం చేసుకో; ఇవన్నీ, ఇట్టే చల్లారిపోవటానికి వీలుందా?'—

'లేదుగాని—ఆ శుభదినం మన జీవితకాలంలో వస్తుందా రాదా అని నా సందేహం'—

'ఏమిఁ?'—

'తుది విజయం మనం చూడమేమో'—

'తుదివిజయం చూస్తామూ, చూడమూ అన్నది ప్రశ్న కాదు. విజయానికి తోడ్పడటమే మన ఆశయం—మన జీవితంలోనే సాధించితీరగలమని నా నమ్మకం. అలా కాకపోయినా మరేం బెంగలేదు—ఈ కార్యరంగంనుంచి అడుగు వెనక్కు వేసేది లేదు.'

తనను పిరికిపందక్రింద జమకట్టి మాట్లాడుతోందని డిఫార్జ్‌కి పొడుచుకొచ్చింది:

'ఆఁ!—ఏమిఁటీ—నేనుమాత్రం—' అన్నాడు.

'అవును—అదే నేను చెబుతున్నది. కాని నీలో ఒక బలహీనత వుంది. నీకు ఎప్పుడూ, ఏ శత్రువో, ఏ అవకాశమో ఎదట కనుపించుతూవుండాలి; లేకపోతే చచ్చుబడిపోతావు. అలాంటిది లేకుండా నిభాయించుకురావాలి; అవసరం వచ్చేవరకూ మనలో వున్న పెద్దపులిని గొలుసులేసి కట్టేసి అట్టిపెట్టుకోవాలి గాని చంపేసుకోగూడదు. అవసరం వచ్చినప్పుడు గొలుసులు ఊడదీసి బరిమీదికి వదలాలి' ఈమాట చెబుతూ బల్లమీద వున్న డబ్బుమూట చంకలోకి తీసుకుని, చాలా ప్రొద్దుపోయింది వెళ్లి పడుకుందాం అని లేచి నిల్చుంది.

ఆ మర్నాటి మధ్యాహ్నం ఆ యువతి యథాప్రకారం పానశాలలో అమ్మకం బల్లదగ్గిర కూర్చుని, లతలు కుట్టుకుంటోంది. ఆ బల్లమీద ఒక గులాబిపువ్వు పడేసివుంది; తోచనప్పుడల్లా ఉండుండి ఆ పువ్వువంక చూస్తోంది. ఆవేళ పానశాలలో యెంతోమంది. లేరు. తీవ్రంగా యెండకాస్తోంది. మాడమ్ డిఫార్జ్ చుట్టూ బల్లలమీద ఏదో బంకపులిమిన కొన్ని గాజుగ్లాసులు పెట్టివున్నయ్. వాటిమీదకు వచ్చి వాలుతున్న ఈగలు చచ్చి గ్లాసుల్లో పడుతున్నయ్. మళ్ళీ వచ్చి వాలబోతున్న యీగలు వీటి కళేబరాలను చూస్తూ కూడా లెక్క చేయటంలేదు. వాటికి పుట్టిన జబ్బేమిఁటో అవగతం చేసుకోవటంలేదు. ఆ చచ్చినవి అవేవో చాలా స్వల్ప ప్రాణులైనట్టు, తామేమో పెద్ద ఏనుగులైనట్టూ మదంగా వచ్చి ఆ గ్లాసులమీద వాలి అవి కూడా చచ్చి గ్లాసుల్లో పడుతున్నయ్. బహుశా అవికూడా రాజదర్బారులో వున్నవాళ్ళ మనుకుంటున్నాయో యేమో.

ఇంతలోనే యెవరో ఒక వ్యక్తి లోపలికి వచ్చాడు. అతని నీడ, తల వంచుకు లతలు కుట్టుకుంటున్న మాడమ్ డిఫార్జ్‌మీద పడ్డది. అదేదో కొత్తనీడలా ఆవిడకు తోచింది. చేతిలోవున్న కుట్టుసామాను బల్లమీద బెట్టి, బల్లమీదవున్న గులాబిపువ్వు తీసి తలలో బెట్టుకుని అనంతరం తల పైకెత్తి అతనివంక చూచింది.

చిత్రమైన సంఘటన; ఆ స్త్రీ గులాబిపువ్వు తీసి తలలో ఎప్పుడు గుచ్చుకున్నదో, వెంటనే అక్కడ నున్న యావన్మందీ మాట్లాడుకోవటం మానేశారు. ఒకరొకరే లేచి బయటికి వెళ్ళిపోతున్నారు.

'నమస్తే!' అన్నాడు కొత్తమనిషి.

'నమస్తే!' అంటూ ప్రత్యభివాదం చేసి మాడమ్ కుట్టుసామాను చేతిలోకి తీసుకుంది; లోలోపల మెచ్చుకుంటోంది—వయసు షుమారు నలభై, ఎత్తు ఆరడుగులు, నల్లటి జుట్టు, కాటుకకళ్లు, చామనచాయ, కోలమొహం, గద్దముక్కు, ముక్కు చివర ఎడమబుగ్గమీదికి వంపు.

'గుక్కెడు చల్లటి మంచితీర్థం—ఒక గ్లాసెడు ఒకటో రకం వైను యిప్పించండి!'—

మాడెమ్‌డిఫార్జ్, చాలా గౌరవపురస్సరంగా, ఆ వ్యక్తి అడిగిన పానీయాన్ని అందించింది.

'ఆహాహా! ఎంతబాగున్నదండీ!' అంటూ మెచ్చుకున్నాడు, ఆ కొత్తమనిషి.

ఆ వైను సంగతి ఆ మనిషికంటే ఆవిడకే యెక్కువ బాగా తెలుసు; ఇంతవరకు, ఆ పానీయాన్ని మెచ్చుకున్న ప్రప్రథమ వ్యక్తి అతనొక్కడే; అయినా మాడమ్ డిఫార్జ్ కాదనలేదు. చిరునవ్వు నవ్వుతూ కుట్టుసామాను మళ్లా అందుకుంది. ఆ మనిషి ఆ కుడుతున్న వ్రేళ్ళవంక ఒకటి రెండు క్షణాలు పరిశీలనగా చూచి, అనంతరం ఆ అవకాశం తీసుకుని, నలుముఖాలా కలయ జూస్తూ ఆ ప్రదేశాన్నంతా అర్థంచేసుకోవటానికి ప్రయత్నించుతున్నాడు.

'మీకు కుట్టుపని బాగా చేతొనట్లేవుంది' అన్నాడు.

'బాగా అల్లవాటే'

'ఆ లతకూడా ఫసందుగా వుంది'—

'నిజంగా ఫసందుగావున్నదంటారా?' అతని వంకచూసి చిరునవ్వు నవ్వింది.

'చాలా పసందుగా వుంది...ఏమిఁటి కుడుతున్నారు'—

'ఏదో తోచక'

'అంతేనా?'—

'అంతే—ఇలాగే యేవో కుడుతుంటే మొత్తం అంతా కలిపి యేదన్నా తయారుచెయ్యొచ్చు.'

మాడమ్ డిఫార్జ్ సిగలో ఆ గులాబిపువ్వు వుండటం ఒక ప్రత్యేకతగా కనుపించుతోంది; కారణమేమిటంటే, సెయింట్ ఆంటోనీప్రాంతంలో నివసించే స్త్రీలలో సాధారణంగా, గులాబిపువ్వు తలలో పెట్టుకునే స్త్రీ యెవ్వరూ కనుపించరు. ఒకయిద్దరు మనుషులు హడావిడిగా లోపలికివచ్చి, సారాగ్లాసులకు ఆర్డరివ్వబోయారు. తీరా లోపలికి వచ్చి ఆ గులాబిపువ్వువంక జూచి వెనక్కు తగ్గి యెవరికోసమో వెతకొచ్చిన వాళ్లు, లాగు యిటూ అటూ తొంగిచూసి బయటికి వెళ్లిపోయారు. అంతే గాదు, ఆ కొత్తమనిషి లోపలికి రాకపూర్వం ఆ పానశాలలో కూర్చుని బాతాఖానీ వేస్తున్నవాళ్ళలో యే ఒక్కడూ మిగల

కుండా బయటికి వెళ్లిపోయారు. ఆ వచ్చిన గూఢచారి కళ్లు తెరుచుకునేవున్నాడు. కాని అతనికి యిదంతా రవ్వంతేనా అర్థం కాలేదు. ఏదో మామూలుధోరణిలో వెళ్లిపోయినట్టే వెళ్లిపోయారు.

'ఏమండీ మీకు వివాహమైందా?' అని ప్రశ్నించాడు.

'అయింది'

'పిల్లలా?'

'లేరు'—

'వ్యాపారం యేమంత బాగున్నట్టు లేదే'

'ఏం బాగుంటుంది—ఇక్కడ వుండే వాళ్లంతా పొట్టకూటికి గతిలేని మూక'

'అవును పాపం నిర్భాగ్యులు—మీరన్నట్టు—పీడిత ప్రజ'

'నే నన్నట్టా!—ఏమిటీ?'—

'ఎబ్బే ఏమీ లేదులెండి—మీ రనటం కాదు—నేనే అంటున్నాను—మీరు మాత్రం అలా అనుకోవటం లేదూ?'—

'అనుకోవటాలూ, ఆలోచించటాలూ వీటన్నిటికి మాకు తీరికెక్కడుంది. నాకూ మా ఆయనకూ ఈ దుకాణం యీదుకు రావటమే చావు తెరపులవుతూ వుంటుంది. మేవు ఆలోచించేదల్లా ఒక్కటే—"బ్రతికట మెట్లాగా" అని. మా బ్రతుకు సంగతొకటి మేము ఆలోచించుకుంటే చాలు—ఇతరుల సంగతులదాకా పోనక్కర్లేదు.'

గూఢచారి తెల్లముఖం వెయ్యలేదు. బాతాఖానీ కొట్టాలనే ధోరణిలో వున్నవాడులా లేచి మాడమ్‌డిఫార్జ్ బల్లదగ్గరి కొచ్చాడు. మోచేతులు బల్లమీద ఆనించి, మధ్యమధ్య గుక్కెడు గుక్కెడు వైను త్రాగుతూ కబుర్లాడుతున్నాడు:

'గాస్పర్డును ఉరిదీయటం, ఎలాగైనా చాలా కిరాతకృత్యం సుమండీ—దారుణం—హుఁ పాపం యెంత మంచివాడు.'

మాడమ్ డిఫార్జ్ తొణక్కుండా సమాధానం చెప్పింది: 'ఇదిగో? నేనొకటి చెబుతాను వినండి—ఇలాంటి విషయాల్లో కత్తులూ కటార్లూ ఉపయోగించేవాళ్ళు యేనాటికైనా నాశనం గాక తప్పదు. చేసుకున్నవారికి చేసుకున్నంతా అనుభవించక తప్పుతుందా?'

తనో పెద్ద విప్లవవాది అయినట్టూ, గాస్పర్డును గురించి అలా మాట్లాడటం అతనికి కంటకంగా వున్నట్టూ పోజు బెట్టాడు. గొంతు తగ్గించి ఎంతో ఆంతర్యంవున్న నమ్మకస్తుడిలాగా ముఖంలో ముఖం బెట్టి మాట్లాడుతున్నాడు:

'మీకు తెలియదుగానీండీ! ఈ ప్రాంతంలోవున్న జనానికంతకీ గాస్పర్డ్‌పట్ల యెంత అనురాగముంది? వాళ్ళంతా ఎంత మండుతున్నారంటారు?—మనలో మనమాట'

'మండుతున్నారంటారా?'

'లేదంటారా?'—

'—అదుగో! మా ఆయన వచ్చారు!'

డిఫార్జ్ లోపలికి అడుగుబెట్టడంతోనే, గూఢచారి 'నమస్తే! జాక్విస్ గారూ!' అంటూ, అభివాదం చేశాడు.

జాక్విస్ కొంచెం కంగారై కాళ్లు తొక్కుతున్నాడు; కాని మళ్లీ వెంటనే నిభాయించుకుని: 'మీరు! పొరబడుతున్నారు—ఎవరో మరోమనిషని పొరపాటుబడుతున్నట్టున్నారు. నా పేరు జాక్విస్ గాదు—ఎర్నెస్టు డిఫార్జ్'—

'ఏదైతే యేమిటిలెండి—నమస్తే!'—

'నమస్తే'

'నేనూ మాడమ్ డిఫార్జ్ యేదో మాట్లాడుకుంటున్నాం లెండి—నేను చెబుతున్న దేమిటంటే—గాస్పర్డ్‌ను అలా చిత్రవధ చెయ్యటం సెయింట్ ఆంటోనీ ప్రాంతంలోవున్న యిక్కడి వాళ్లకందరికీ చాలా కంటకంగా వుందంటున్నాను—ఔనంటారా కాదంటారా'

'అలా అని నాతో ఏ వొక్కడూ అనలేదు' అన్నాడు డిఫార్జ్: 'అలా అనుకుంటున్నారని నాకు తెలిసే తెలీద?' అంటూ డిఫార్జ్ అమ్మకంబల్లవెనక్కు నడిచి, భార్య కూర్చున్న కుర్చీవెనక చట్రం పుచ్చుకు అతనివంక జూస్తూ నిల్చున్నాడు.

ఆ గూఢచారి ఆరితేరిన ఘటం: తొణుకూ బెణుకూ లేకుండా, నిల్చుని గ్లాసులోవున్న వైను ఆఖరుచేసి, ఒక గుక్కెడు చల్లటి మంచినీళ్లు గొంతులో పోసుకుని, మరోగ్లాసు వైనుకు ఆర్డరిచ్చాడు. మాడమ్ డిఫార్జ్ అంతకంటే తాపీగా వైనుగ్లాసు అతనికి అందించి, మళ్లీ కుట్టుసామాను అందుకుంది. ఏదో జాతీయ గీతం ఒకటి కూనిరాగంగా ఆలాపన చేస్తూ, తలెత్తి చూడకుండా కుడుతోంది.

'ఈ ప్రాంతం సంగతి నాకంటే మీకు బాగా తెలుసునల్లే వుంది' అన్నాడు డిఫార్జ్—ఆ క్రొత్తమనిషి ముఖంలోకి చూస్తూ.

'ఎబ్బే యేమీ తెలీదండీ— తెలుసుకోవాలనుకుంటున్నాను. పాపం! యిక్కడి బీదవాళ్లందర్నీ చూస్తుంటే నా కెంతో యిదిగా వుంది.'

'ఓహో! అలాగా'—

'డిఫార్జ్‌గారూ! మీతో పరిచయం గలగటం నా కెంతో ఆనందంగా వుంది—మీ పేరు విన్నాలెండి'—

'ఓహో అలాగా!'—

'డాక్టర్ మానెట్‌ను విడుదలచేసినప్పుడు ఆయన్ను మీదగ్గరికే గాదూ తీసి తెచ్చుకున్నారూ—ఆ సంగతులన్నీ నాకు చెప్పారులెండి'

మాడమ్ డిఫార్జ్ మోచేత్తో పొడిచింది: సమాధానం చెప్పమన్నట్టు; డిఫార్జ్: 'అవునవును' అన్నాడు.

'ఆయన మీదగ్గిరుండగా, ఇంగ్లండునుంచి ఆయన కూతూరూ, టెల్‌సన్సుబ్యాంకు గుమాస్తా—ఆయన పేరేమిటీ—ఆఁ! ఆఁ!—లారీగారూ మీయింటికొచ్చారుగదూ?'

'అవును—మా యింటికే'—

'డాక్టర్‌గార్నీ కూతుర్నీ యెరుగుదునులెండి'

'ఆహా—అలాగా'—

'వాళ్ళదగ్గిరనుంచి యీమధ్య మీకు ఉత్తర పత్తరా లేవీ రావటం లేదా?'

'లేదు'—

మాడమ్ డిఫార్జ్ అందుకుంది: 'వాళ్లు ఇంగ్లండు వెళ్లిన కొత్తలో ఒకటి రెండు ఉత్తరాలేవో వ్రాశారు; తరవాత మళ్లీ మా అజ వాళ్లకూ లేదు, వాళ్ల అజ మాకూ లేదు. వాళ్ల బ్రతుకేదో వాళ్లు బ్రతుకుతున్నారు; మా బ్రతుకేదో మేవుఁ బ్రతుకుతున్నాం.

'అంతేలెండి'—అన్నాడు గూఢచారి—'ఆ అమ్మాయి పెళ్లిజేసుకోబోతోంది'—

'ఇంకా చేసుకోబోవట మేమిటి?—ఇంతకాలంగా పెళ్లే చేసుకోలేదా — మీ ఇంగ్లీషువాళ్లు యెలాగైనా మందకొడిమనిషులు'—

'అయిందీ! నేను ఇంగ్లీషువాణ్ణని పసిగట్టేశారూ?'

మాడమ్ డిఫార్జ్ చిరునవ్వు నవ్వింది: 'ఏమిటి యిందులో

(39-వ పేజీ చూడండి)

# భుక్తాయాసము





రెండు రోజులు పోయి భుక్తాయాసపు రోజులు వచ్చినవి. పడకకుర్చీలో వాలి తమలపాకులు నెమరవేస్తూ ఈవారము వచ్చిన పత్రికలనుచూస్తున్నాను.

ఇంతలో చంద్రమండలమునకు ప్రయాణమునకు టిక్కెట్లు రిజర్వేషను హడావిడిని గురించి వ్రాసిన వివరాలు కంటబడ్డవి. ప్రస్తుతము ఏడుకొండలవాడిని ఎంత సులువుగా దర్శించుకోనగలుగుచున్నామో, అంత సులువుగానే కొలది కాలములో చంద్రయ్య వద్దకు పోవచ్చునట! ఇహముందు పసిపాపలకు అద్దములో, నీళ్లలో, పాలలో చంద్రుణ్ణి చూపనక్కరలేదు. బహుశా మునుపు ఈ కిటుకు తెలుసుకొనే హనుమయ్య సూర్యుడుగారిని కలుసుకున్నారు కాబోలు! చంద్రుడిదగ్గరకు పోవటానికి ఇప్పుడే రిటర్ను టిక్కెట్లు రిజర్వు చేయించుకుంటున్నారట. కొంతమందికి దొరకలేదట. వాటికీ రేషనే! ఇప్పుడు ఈ టిక్కెట్లు చాలా ఖరీదట. కొద్ది రోజులలో చౌకయే అవకాశాలున్నవట. కొంపతీసి యుద్ధానికి ముందు దసరా క్రిస్మస్ శెలవులలో దొరికిన సన్యాసి టిక్కెట్లలే కారుచౌకవవుకదా?

ఈ టిక్కెట్లు అమ్మేవాళ్లకు నేను ఒక సలహా పంపిద్దామనుకుంటున్నాను- నాదివ్యమైన సలహాను తీసుకుంటే అందరికీ శుభము తథ్యము - చంద్రమండలానికి రిటర్ను టిక్కెట్లు పెట్టకుండా, వెళ్ళే టిక్కెట్లవరకే ఇస్తే మంచిది - అక్కడికి పోయినవాళ్లు అక్కడనే వుండి తిరిగి రాకుండావుండటము ఎందుకైనా మంచిది. ఎందుకైనా మంచిదేమిటి, అసలు అన్నివిధాలా మంచిది- ఇక్కడ జనసంఖ్యసమస్య, ఆహార సమస్య, గృహ సమస్య, అవలీలగా తేలిపోతవి. రాజకీయవేత్తలకు తలనొప్పి తగ్గుతుంది. చంద్రమండలమునకు వెళ్ళినవాళ్ళకు అక్కడ అన్ని వసతులూ సమకూరునా లేదాయని మనము ఆలోచింపనక్కరలేదు. అవసరమే ఉపజ్ఞతకు మాతన్నారు (*necessity is the mother of invention*)-మళ్లీ మానవ

శ్రీ [illegible] రఘురామ్

నాగరిక చరిత్ర వ్రాసేవాళ్లు వ్రాస్తే, చదివేవాళ్లు చదువవచ్చు-క్రొత్త ఫక్కీలో ఈసారి డార్విను సిద్ధాంతము (*Darwin theory*)ని ఆవలకు తోసి, అరవిందఘోష్ అతీతమైన మేధస్సు (*Super-mind*) ప్రకారము ఆలోచనలు సాగించవచ్చు-

నామట్టుకి నాకు చంద్రమండలానికి పోయేవారికి అక్కడమంచి అవకాశము లుండగలవని గట్టి నమ్మకమున్నది. చక్కగా సరికొత్తపద్ధతిలో సరికొత్త జీవితాలు బాగా ప్లాను వేసుకొని సోషలిస్టు పద్ధతినో, కమ్యూనిస్టు పద్ధతినో లేక ప్లేటో అరిస్టాటలు పద్ధతులలోనో లేక మరి ఏ ఇతరపద్ధతులలోనైన ఆరంభించవచ్చు - అసలు ధనికవర్గము (*Capitalists*) చంద్రమండలమునకు టిక్కెట్లు కొని కమ్యూనిస్టులకు ఉచితముగా బహూకరించితే బాగుంటుంది. వాళ్లు సంఘమునిూద చేయదలచుకొన్న పరిశోధనలు (*Experiments*) అన్నీ నిరాటంకముగా చేసుకోవచ్చు - ప్రస్తుతము టిక్కెట్లు రిజర్వుచేసుకొన్నవాళ్ళలో చాలామంది వేదాంతకోవిదులు, శాస్త్రవేత్తలు వున్నారట. చంద్రమండలములో మతముగాని మతముఆరంభించవచ్చు. (ఏమతము లేకుండా ప్రకృతుండగలదా?) ఏటము బాంబు, హైడ్రోజన్ బాంబు వగైరాలన్నిటికన్నా ఏదైనా ఇంకా బలముగల బాంబు కనుక్కొని భూగోళముమీదకు వేస్తే, ఈ శని విరగడై పోతుంది; వారికీ పుణ్యముంటుంది (పాపము మాత్రము కాదు.)

చంద్రమండలానికి ప్రయాణముహూర్తము నిర్ణయించటానికి సిద్ధాంతులు కొత్తపంచాంగములు వ్రాయాలి—ఇదివరకు ఉత్తర దక్షిణాలకు తూర్పు పడమరలకు, మొత్తం నాల్గుదిక్కులకు వెళ్లటానికి పంచాంగపు పద్ధతులున్నవి గాని, అంతరిక్షానికి ఎగయటానికిఎట్లా ముహూర్తము నిశ్చయించాలసినది పంచాంగాలు చెప్పటములేదు.



భుక్తాయాస మైతే తగ్గింది. ఎండలు చాలా మెండుగానున్నవి. లేచి పోను

(4-వ పే చూడండి)

# కథ అడ్డం తిరిగింది

శ్రీ కాలజ్ఞానం రామారావు

[రామప్పంతులు గారిల్లు. అతనికి సుమారు 52 ఏళ్ళుంటాయి. కాని అంతకన్నా ఎక్కువగా నే కనబడుతాడు. ఆ వూళ్ళో స్కూల్లో టీచరు. అతని భార్య కామమ్మ. సుమారు 45 ఏండ్లయినా ఇంకా చెదరని అందంగల గృహిణి పెండ్లి యీడొచ్చిన సరళ, సుమారు 12, 7 సంవత్సరాల మధు, వాసులు వాళ్ళ సంతానం. తల్లికి తీసిపోని అందం పిల్లది.]

(ప్రవేశం రామప్పంతులు

రామ . ఒసేయ్...ఏమేయ్...యిదుగో యిలా త్వరగా రా.

కామమ్మ : ఆ.. వస్తున్నానండీ.

రామ : అబ్బా...నిన్నే.....త్వరగా రావేం.

కామ : స్ అబ్బా. ఏమండీ ఏమి తొందరొచ్చిపడిందని యిలా అరుస్తున్నారు.

రామ : అది కాదే. అమ్మాయిని చూడ్డానికొస్తున్నారే. త్వరగా దాన్ని మొహం కడుక్కోమని, జెడవేసి సింగారించు.

కామ : (సమీపించి) ఆ...ఏమన్నారూ?...

రామ : పిల్లను చూడ్డాని కొస్తున్నారే. అమ్మాయిని కాస్త సింగారించి, యిల్లు కాస్త సర్దు. ఆ పిల్ల వాళ్ళకూడా మొహాలుకడిగి తల కాస్త దువ్వు.

కామ : ఇంతకూ ఎవరన్నారూ? మొన్న వెళ్లి మాట్లాడొచ్చారు; వాళ్లేనా?

రామ : ఆ వాళ్ళే. అదే సాంబమూర్తి గారి సంబంధం. ఇంకో గంటలో వాల్తున్నారు. ఆ...వాళ్ళకు కాస్త కాఫీ, యింకేదన్నా ఫలహారం చేసిపెడ్తావా? ఒద్దులే. నే వెళ్ళి హోటల్లో పట్టుకొస్తా గానీ నీవు త్వరగా ముస్తాబులు కానీ. అమ్మాయికి మొన్న కొన్నాం చూడూ, ఆ సిల్కు చీర కట్టించు. పెట్లో వున్న ఆ గొలుసూ, ఆ వంకీలూ తగిలించి, నీ వడ్డాణం వెయ్యి. ఏం. ఆ పిల్లలక్కూడా ముస్తాబు చేయి. త్వరలో కానీయాలి. ఏం?

కామ : సరే గానీ, ఎవరెవరొస్తున్నారండీ?

రామ : ఆ అబ్బాయీ, తల్లిదండ్రులూ, చిన్నతమ్ముడూ, మన చిన్నవాడంతటి వాడు లే. ఇక నే వెళ్ళోస్తా పొద్దు బోతుంది.

కామ : మరి యీలా పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పకపోతే, కొంచెం త్వరగా వచ్చి చెప్పరాదటండీ?

రామ : అబ్బా తీరికేదీ. హెడ్మాష్టర్ వూళ్ళో లేడాయె. ఆచార్జీ మనమే చూడాల్సొచ్చె. ఎల్లాగో తెములుచ్చుకొచ్చా. మన ముచ్చట్లు ఎప్పటివేగా. తర్వాత మాట్లాడుకుందాం. నే వెళ్ళొస్తా. (వెళ్ళుతాడు)

కామ : ఒరేయ్ వాసూ, యిలా రారా త్వరగా, మీ అక్కయ్యను పిల్చుకురారా (ప్రక్కింటి కాంతంతో మాట్లాడ్డానికి వెళ్ళింది.

వాసు : ఊహూ. నేవెళ్లి ఆడుకోవాలి, అన్నయ్యను వెళ్ళమనే.

కామ : వెళ్ళు నాయనా వెళ్లు. వాళ్ళొస్తున్నారు అక్కయ్యను చూడ్డానికి. త్వరగా రమ్మను ఏం! పోయి పిల్చుకరామ్మా.

వాసు : అది కాదమ్మా, ఎవరే రావడం? మామయ్యేనా? మొన్న నే వెళ్ళాడుగా అప్పుడే వస్తాడా మామయ్య?

కామ: కాదురా. అబ్బాయి వాళ్లు వస్తున్నార్రా అక్కయ్యను చూడ్డానికి. అక్కయ్యకు పెళ్ళవుతుందిలే. వెళ్లి పిల్చుకరా నాయనా.

వాసు : మరే అమ్మా. అక్కయ్య పెళ్ళి మనయింట్లోనే జరుగుతుందా? మరి నాకు కొత్త లాగు, చొక్కా కుట్టించరూ నాన్న. నాకు బుష్కోట్ కుట్టించమనే ఎఱ్ఱది. ప్రక్కింటి చంద్రంలాంటిదే.

కామ : అల్లాగేలేరా, ముందు వెళ్ళి మీ అక్కయ్యను పిల్చుకరారా.

(వాసు సంతోషంతో వెళ్తుతాడు.)

(మధు ప్రవేశం)

కామ : ఒరేయ్ మధూ, త్వరగా వెళ్ళి మొహం కడుక్కొని కొత్తబట్టలేసుకురారా, తలదువ్వుకుందువుగానీ. అక్కయ్యను చూడ్డానికి వస్తున్నార్రా.

మధు : అక్కయ్యను చూడ్డానికా?

కామ : అవున్రా. త్వరగా వెళ్ళి మొహం కడుక్కోరా నాయనా.

మధు : మరీ, అక్కయ్యను చూడ్డానికొస్తే మధ్య నేనెందుకూ సింగారించుకోవడం? అక్కయ్యనే సింగారించవే.

కామ : ఆ [illegible] వేళకి శుభ్రంగా వుండకపోతే [illegible]

మధు : ఇష్టంవుంటే చేసుకుంటారు, లేకుంటే వచ్చినదోవనే తిరిగిపోతారు. అదిగాక నన్నేం పెళ్ళాడరుగా వాళ్లు.

కామ : ఓరి వెధవా! మొహం కడుక్కోరా అంటే పెద్ద లాయరులా వాదిస్తూ నిలబడ్డావేంరా!

మధు : నీకా తొందరెందుకుగాని నేనా వేళకు యింట్లో వుండనులే. మాస్కూల్లో ఓ మంచి మేచ్ వుంది. ఫుడ్‌బాల్ మేచ్-నీవుచేసే అన్నం ముద్దలు కాదులేగానీ-నే వెళ్లుతున్నా. (వెళ్లుతాడు)

(ఇంతలో సరళ, వాసూ వస్తారు)

వాసు : ఇదుగోనమ్మా అక్కయ్య.

కామ : త్వరగా రావే అమ్మాయ్. చూడ్డానికి అబ్బాయివాళ్లు వస్తున్నారే. జడవేసుకొని, మొహం కడుక్కొందువురా. జడవేస్తాను కూర్చో. ఆ నూనెసీసా, దువ్వెన పట్టుకరా అలాగే. ఒరేయ్ వాసూ, వెళ్లి మొహం కడుక్కోనిరా నాయనా, తలదువ్వుకొని కొత్తబట్ట లేసుకుందువుగాని. (వెళ్లుతాడు. సరళ వచ్చి కూర్చుంటుంది)

కామ : ఇగుగో అమ్మాయ్, త్వరగా మొహం కడుక్కొని మొన్నకొన్న సిల్కు చీర కట్టుకొని, ఆ యింగ్లీషు వాయిల్ రవిక తొడుక్కో. పెట్లో గొలుసు, వంకీ, నా వడ్డాణం తీసుకొని పెట్టుకో. ఏం?

సరళ : ఆ వడ్డాణం నే వేసుకోలేనే, కావలిస్తే నీవే వేసుకో వాళ్లకు తెలియడానిక్కి. నా కొద్దు.

కామ : ఏమోనమ్మా, మీ నాన్నగారు చెప్పింది నే చెప్పాను. తర్వాత నీ యిష్టం, వారి యిష్టం.

సరళ : నా కొద్దే ఆ బరువు. చేయిస్తే దాన్ని గాజులు చేయించు. లేకుంటే నా కొద్దులే. నీ కొడండ్లొస్తారుగా వాళ్ళకు పంచిపెట్టు, నా కక్కర్లేదులే.

కామ : ఇదేమిటే యీ వితండవాదం. ఇష్టంవుంటే వేసుకో, లేకుంటే మాను. ఏదో మీ నాన్నగారు చెప్పింది చెప్పాను గానీ, ఇంతకూ మీకేమి తెలుసులే మా కష్టాలు. తొమ్మిది నెలలూ మోసి, కని, పెంచేటప్పటికే సగమైపోయాము, ఈ పెండ్లిచేయటంలో యింకా కుమిలేలాగుంది. నీ కోసమని వాళ్ళావీళ్ళా కాళ్లు పట్టుకోవలెగానీ...ఏదో వొక్కగానుఒక్క కూతురువని మంచి సంబంధంకోసం రెక్కలు కట్టుకొని తిరుగుతున్నారు ఆయన. మీకేమంటే ఎక్కడలేని పోకులూ నీటులూను. ఏదో యీ సంబంధమన్నా కుదిరిందంటే ఆ భారం కాస్తా తీరుతుంది. తర్వాత వాళ్ళిద్దరి విషయమై కంగారేలేదు. వాళ్లే పిల్లనిస్తామంటూ ఎగబడు

తారు. ఆ. యిక వెళ్లి మొహం కడుక్కొని ముస్తాబవు తొందరగా: (సరళ లేచి వెళ్లుతుంది. ఇంతలో వాసు వస్తాడు మొహం తుడుచుకుంటూ.)

కామ : ఏంరా అబ్బాయి మొహం కడుక్కున్నావా? యిలారా తల దువ్వుతాను. (దువ్వుతూ) ఇదుగో అబ్బాయ్, నీవు వాళ్ళ ఎదుట ఏం రచ్చ చేయక నాన్నగారితోనే వుండాలి. ఏం?

[వాసు మాట్లాడడు.]

* * *

[15 నిముషాల తర్వాత. అదే యిల్లు. తుడుచుకోని మొహంతో రామప్పంతులు ప్రవేశం]

రామ : ఒసేయ్, ఆ తువ్వాలిలా పట్టుకురా, మొహం తుడుచుకోనీ.

(తెచ్చియిస్తుంది)

రామ : అదేమిటే, అమ్మాయికి వేయమంటే వద్దాణం నీవు వేసుక్కూచున్నావు. ముచ్చట ఎక్కువైనట్టుందే.

కామ : అమ్మాయి వద్దంటుంటే నన్నేం చేయమంటారు? మధ్య నాకు ముచ్చట ఏడ్చిందేమిటి.

రామ : ఇంతకూ అమ్మాయి ముస్తాబైందా?

కామ : గాజులు తొడుక్కుని పూలు కడుతోందిలెండి. మనమంతా తయారైనట్లే. వాళ్ళదే ఆలస్యం. ఇంతకూ ఫలహారం ఎక్కడ పెట్టారు?

రామ : అదిగో ఆ టేబిల్ మీద వుంచాను. మరి అబ్బాయి లేరీ? యింట్లో లేరా?

కామ : పెద్దవాడేమో తల దువ్వుకొని బట్టలేసుకోమంటే పెద్ద లెక్చరిచ్చి, స్కూల్లో ఏదో మేచీ వుందని వెళ్ళాడు. కుట్టాడేమో ముస్తాబై వాళ్ల అక్కయ్యతో మాట్లాడుతూ కూర్చున్నాడు.

రామ : సరే. అదిగో ఆ చాప తెచ్చి అలా వేయి. అమ్మాయిని కూర్చోబెట్టడానికి అటువైపుగా ఓ చాప వేసిపెట్టు. తెలిసిందా? వాళ్లొచ్చే వేళయింది. అమ్మాయిని సిద్ధం చేసివుంచు.

(వీధిలో బండి ఆగిన చప్పుడు)

ఆ...అదిగో వచ్చేశారు. నీవు వెళ్ళి పిల్లను సిద్ధంచేయి. నేను వారిని పిల్చుకొస్తాను...నమస్కారమండీ పంతులుగారూ, మీకోసమే ఎదురుచూస్తున్నాం. రండి లోపలికి రండి. రైలు లేటులా తోస్తుంది. మెల్లగా దిగు అబ్బాయి.

(అందరూ బండి దిగుతారు)

రండమ్మా, రండి. ఉండండి, ఆ చాప నేను సరి చేస్తాను. కూర్చో అబ్బాయ్, కూర్చో. ఒరేయ్, వాసూ, ఓ చెంబుతో మంచినీళ్లు పట్రా నాయనా, చాలా అలసినట్టున్నారు. ఈ రోజుల్లో రైలు ప్రయాణమే అంత. కాళ్లు, చేతులూ కడుక్కుందురు రండి.

సాంబమూర్తి (అబ్బాయి తండ్రి) : ఆ ఫరవాలేదులెండి. మీ కెందుకులెండి వృథా శ్రమ. ఇప్పుడే స్నానం చేసి వస్తున్నాము. ప్రక్క వీధిలో సాంబయ్యగారు మీకు తెలుసుననుకుంటాను. ఆయన మా మేనమామ కొడుకులెండి. ఏదో ఒళ్లు బాగులేక పడుకొన్నారులెండి. లేకుంటే మాతోగూడ వచ్చుండేవాడు.

రామ : ఏదో కాస్త ఫలహారమైనా పుచ్చుకోండి. ఒసేయ్, కాఫీ, ఫలహారం పట్టుకరా.

సాంబ : ఆ ఎందుకులెండి మీకు వృథా శ్రమ. మే మిప్పుడే తినివొస్తున్నాము. ఒద్దంటే విన్నారు కారు. తిని కదలమని పట్టుబట్టి తిన్నదాకా వదిలారు కారు. మీ రేమీ శ్రమ పెట్టుకోకండి.

రామ : ఆ...అంత పెద్ద మాటలెందుకులెండి. ఇంటికివచ్చినవారిని శక్త్యానుసారం సత్కరించడం మన విధి. ఏదో దేవుని దయవల్ల అన్నీ అనుకూలించాలేగానీ...

సాంబ : ఇదుగో రామప్పంతులుగారూ, ఏదో మీరు మంచివంశస్థులని, మీది మంచి సంబంధమేననీ, మా గౌరవానికీ, మావంశ గౌరవానికీ లోపముండదనీ మేమూ యింత దూరం వచ్చాం. ఇంతకూ అన్ని సంగతులూ మీకు చెప్పేవున్నాం. ఇక మిగతది, ముఖ్యమైంది కూడానూ, పిల్లవానికి పిల్ల నచ్చడమే. తర్వాత మన సంబంధం స్థిరపడ్డట్టే!

రామ : అంతే లెండి. మీరూ యింత దూరం వచ్చారు మా సంబంధం కోసమని. ఇక మా అమ్మాయి సంగతి మాత్రం నే చెప్పనక్కరలేదు లెండి. చెప్పుకుంటే ఆత్మస్తుతి అవుతుందేమో! ఇంతకూ మీరే చూడబోతున్నారుగా, ... నే చెప్పనవసరం లేదు లెండి. అది మెట్టినచోట లక్ష్మి వెలుస్తుందని పుట్టినప్పుడే జ్యోతిష్కులు చెప్పారు. ఇక దాని క్వాలిఫికేషన్లు చెప్పేవున్నాను. పదిమందికైనా రుచిగా, తృప్తిగా యింత వండి వేయగలదు. ఇంటి పనులన్నీ స్వయంగా, సాఫీగా చేసుకోగలదు. ఏదో ఫిఫ్తుఫారందాకా చదివింది కాబట్టి అటు పూర్తిగా అమాయకురాలు గాకుండా, యిటు యీ కాలపువాళ్ళలాగా కాక భర్తకు అనుకూలంగా నడుచుకోగలదు. ఒక్క మాటలో చెప్పాలంటే యిటు పుట్టినయింటికీ, అటు మెట్టిన యింటికీ

అపకీర్తి లేక గౌరవంగా, మర్యాదగా మసలుకోగలదు!

సాంబ: మాకు కావలసింది అంతేనూ. ఆ...యిక మా ప్రకాశం సంగతీ మీకు చెప్పేవున్నాను. మావానికీ, దురభ్యాసాలకీ చాలాదూరం. నిప్పుతునకనుకోండి. చదువులో నంటారా పస్టుగా బి. ఏ. ప్యాసయ్యాడు. మొన్న తాసీల్దారీ వుద్యోగానికూడా దరఖాస్తు పెట్టాడు. రేపో, మాపో అదీ వచ్చిందంటే మీ అల్లుడు తాసీల్దారయ్యాడన్నమాటే. మరో విషయం చెప్పడం మర్చాను. ఇంతకూ మావాడు మా పోరు పడలేక చేసుకుంటున్నాడే గానీ లేకుంటే 'నాకు వుద్యోగం కానీండి. యిప్పుడేమి అవుసరం' అని కూర్చున్నాడు. ఉద్యోగానికేమిలెండి యెప్పుడన్నా వస్తుంది. దానికోసమని ఎదురుచూసే ఖర్మ మేమిపట్టింది మనకూ. ఏదో యీ నెలలో కానిచ్చేయాలని మా సంకల్పం. అటుపైన దేవుడున్నాడు.

రామ: ఆ...అంతేలెండి. మానవమాత్రులం. మనదేముంది లేండి. ఆయన ఎట్లాడమంటే అట్లు ఆడేవాళ్లం. అదిగాక మాకూ ఎంత త్వరలో కానిస్తే అంత భారం తీరినట్లేగా! పిల్ల నచ్చిందంటే యిప్పుడే పెళ్లి ముహూర్తం పెట్టించుకవస్తాను.

సాంబ: మేము వెళ్ళగానే వాడ్ని కనుక్కొని వెంటనే ఓ జాబు పడేస్తాము. తర్వాత భారం మీది. (నవ్వుతారు)

రామ: ఇంతకూ మీరు ఫలహారం తీసుకోవడమే మర్చిపోయారు.

సాంబ: ఆ ఫరవాలేదు లెండి! కలికిన చోట అతకదన్నారు చూచారూ?

రామ: ఆ. అవంతా మనకాలంలో నండీ. యీ కాలంలో యిదో ఫేషన్ అయిపోయింది లెండి. మనమూ దాని ప్రకారం మారుతుండాలిగా పూసరవెల్లిలాగా. తీసుకో అబ్బాయి తీసుకో. అరే... అప్పుడే మావాడు మీ చిన్నబ్బాయితో నేస్తం కలిపాడే! అయితే మన సంబంధం యింక కుదిరిందన్నమాటే! (అందరూ నవ్వుతారు)

* * *

[అదే యిల్లు. కామమ్మ కూర్చొని కూరగాయలు తరుగుతూంటుంది. ఇంతలో రామప్పంతులు చేతిలో జాబుతో ప్రవేశం.]

కామ: ఏమండీ, ఎక్కడనుంచీ జాబు. వాళ్లవద్దనుంచేనా? ఏమని రాసారూ?

రామ: (సంతోషంతో) ఇక పెళ్లి అయినట్లే. అబ్బాయి ఒప్పుకున్నాట్ట. ఎంత త్వరలో ముహూర్తం పెడితే అంత మంచిదన్నారు. మరి నే వెళ్ళి శాస్త్రిలు గారితో మాట్లాడి ముహూర్తం పెట్టుకొస్తాను.

కామ: మరి కట్నం కానుకల సంగతేమి వ్రాశారండీ?

రామ: అదేగా. అప్పుడు చెప్పినట్లు రెండువేలు కట్నం, పైన పిల్లవానికి రిస్టువాచీ, ఉంగరం, ఉన్ని సూటూ, కోటూ, వెండి మరచెంబు, వెండిపళ్లెం, వియ్యంకులకు ధోవతి, పట్టుచీర, ఆడపడుచు లిద్దరికీ రెండు మంచి పట్టుచీరలూ. ఇవి వారి ఆచారమట. వారు మనపిల్లకు ఓ పట్టుచీర, ఓ వెయ్యిరూపాయలదాకా నగలు పెట్టగలరు. పైన మనపిల్లకు మన యిష్టమొచ్చింది పెట్టొచ్చన్నారు. ఏదో అన్ని చోట్ల తిరిగినా అంత యింత కావాలన్న వాళ్ళే గాని వచ్చి పిల్లను చూచిన పాపాన పోలేదు. ఇంతమంచి సంబంధం యింత త్వరలో కుదిరింది అంటే నిజంగా యిది మన అదృష్టమే! రేపు ఆ పిల్లవాని కాస్తా ఆ తాసీల్దారీవుద్యోగమైందంటే రెండు చేతుల్తో సంపాదిస్తాడు. నీ కూతుర్ని కాలు కదల్చనీయకుండా కూర్చోబెట్టిపూజిస్తాడు. ఇదంతా అమ్మాయి అదృష్టం. వాళ్లకేం సొంత యిల్లుంది. వాళ్లవూళ్ళో ఏదో కాస్త భూముందట అదిగాక వాళ్ళ చుట్టమెవడో పడకలో వున్నాట్ట. వాడు కన్ను మూశాడంటే ఆ ఆస్తీ మనదే! సాక్షాత్ లక్ష్మీదేవిలా మెరుస్తుందిలే మన అమ్మాయి.

కామ: ఏదో ఒక్కగాను ఒక్క కూతురు. అది ఎక్కడో మొగుడితో సుఖంగా సంసారం చేస్తే అదే మనకు పదివేలు. ఇంతకూ దాని అదృష్టం మంచిది కాబట్టే యింత మంచి మంచిసంబంధం కుదిరింది. చిలుకా గోరింకల్లాగా ముచ్చటగా సంసారం చేసుకుంటారు.

రామ: అదీగాక పిల్లవాడా బుద్ధిమంతుడు. ధర్మరాజుకన్నా కళంకముందేమోగాని ఆ అబ్బాయి నిప్పుతునకని చెప్పనే చెప్పాడు. మన వంశగౌరవానికి తగ్గట్టు మంచి వంశస్థులతో పొత్తు కుదరటమే ముఖ్యం.

(ఇంతలో వాసు వచ్చి జాబు తీసుకొని 'పిల్లవానికి పిల్ల నచ్చింది' అని మెల్లగా చదువుతుంటాడు.)

కామ: (నవ్వుతూ) అదికాదండీ. మనవాడు ఆ అబ్బాయి తమ్మునితో అప్పుడే నేస్తం కలిపాడండీ. ఇద్దరూ కడవరకూ మాట్లాడుకొంటూ, ఆడుకుంటూ వున్నారు. ఏంరా...ఏమన్నాడురా ఆ అబ్బాయి నీతో?

వాసు: (గొప్పగా) అమ్మా, ఆ అబ్బాయి

పేరు సోమేశమట. వాడూ రెండో తరగతి చదువుతున్నాట్టే అమ్మా - వాడు వాళ్ళన్నయ్య కన్నా బాగా చదువుతాట్ట. వాళ్ళమ్మ 'మా సోమేశం వాళ్ళన్నయ్యలా ప్రతి క్లాసులో ఫేలవక బాగా చదువుతాడ'న్నదట!

రామ : (ఆశ్చర్యంతో) ఆ... ఫస్టుగా బి. ఏ. ప్యాసయ్యాడన్నాడే వాళ్ళ నాన్న!

వాసు : అది కాదు నాన్నా. మొన్న ఓసారి వాళ్ళన్నయ్య పెట్టెలో వాళ్ళమ్మ గొలుసుంటే దాన్ని తీసుకెళ్ళి ఎవరికో యిచ్చేశాట్ట. అది చూసి వాడు వాళ్ళమ్మకు చెప్తే వాళ్ళన్నయ్యను వాళ్ళ నాన్న బాగా తిట్టాడట. వాళ్ళన్నయ్య మద్రాసుకు పారిపోయాడట. వాళ్ళమ్మ 'మా సోమేశం యిలా చేయక బుద్ధిగా వుంటాడ'ని ఏడ్చిందట. వాళ్ళనాన్న వెళ్ళి మరలా వాళ్ళన్నయ్యను పిలుచుకొచ్చాట్ట. 'మా అన్నయ్యలా నే చెడ్డవాణ్ణికాదు. బాగా చదివి మంచివాడవుతా'నన్నాడు నాన్నా. ఆ అబ్బాయి చాలా మంచివాడు నాన్నా.

కామ : (ఆశ్చర్యంతో) ఇదేమండీ, ఆయన మా అబ్బాయి నిప్పుతునకనీ, గౌరవస్థులమనీ చెప్పుకున్నాడు గదండీ! ఏంరా అబ్బాయి, నిజంగా చెప్పాడా లేక...

వాసు : లేదమ్మా. అబద్ధం చెప్తే దేవుడు కొడ్తాడని చెప్పావుగా. మరి అబద్ధం చెప్పొచ్చా?

రామ. ఇదేదో నాటకంలాగుంది. అందుకే యింత తొందర చేస్తున్నాడు. ఇదేదో తెలుసుకోవాలి. అప్పుడే చెప్పకపోయావట్రా అబ్బాయ్.

కామ : (కంగారుగా) ఇప్పటికీ కొంప మునిగిందేముంది లెండి. మన బంగారంలాంటి పిల్లను తీసికెళ్ళి యిట్టి మదనష్టపు కొంపలో కిస్తామటండీ? ఇదేదో బాగా తెలుసుకోందే ముహూర్తం పెట్టించకండి. ఇన్నేళ్ళు పెంచి నాకన్నతల్లిని యిల్లాంటి వాళ్ళ చేతుల్లో పెట్టి గొంతుకోస్తామటండీ! ఈ సంబంధం మన కొద్దని వెంటనే వ్రాసెయండి. లేకుంటే నే నీ యింట్లో ఒక్క నిమిషమైనా నిలువలేను.

వాసు : అమ్మా, మొన్న వాళ్ళన్నయ్య ఏదో తాగొచ్చి వాళ్ళమ్మను, వాణ్ణి పట్టుకొని నిజంగా కొట్టాట్ట. ఇంతలో వాళ్ళ నాన్నొచ్చి ఆయన్ని గదిలో వేసి తాళం వేశాట్ట. వాళ్ళన్నయ్య తలుపు తన్ని రచ్చ చేశాడటమ్మా! అప్పట్నుంచి వాళ్ళన్నయ్యను చూస్తే వాడికి చాలా భయమట.

రామ : ఆ...

కామ : ఏమి మోసమండీ. ఎంతమోసం చేశారండీ, ఇంత రామాయణం వెనకేసుకొని తాము గొప్ప వంశస్థులనీ, మర్యాదస్థులనీ ఏ మొహం పెట్టుకొని చెప్తాడండీ ఆ పెద్దమనిషి! మన చిట్టిని తీసుకెళ్ళి యిల్లాంటి నీచుల యింట్లో ఎలా యిస్తామండీ. మీరు యిప్పుడే వ్రాసేయండి. టెలిగ్రాము యివ్వండి. యీ సంబంధం మన కొద్దండోయ్. ఒద్దని వ్రాసేయండి... ఒరే వాసూ యీలారా నాయనా. బ్రతికించావురా బాబూ. నోట్లోపాలు పోశావురా నాతండ్రీ. లేకుంటే యింత కష్టపడి పెంచి ఆ రాక్షసులచేతుల్లో పెట్టేదాన్ని కదరా నాయనా!

రామ : ఇదుగో, నీవేమీ భయపడకు. నే యిప్పుడే వెళ్ళి వ్రాసి పడేస్తాను, పెండ్లి కొన్ని కారణాలవల్ల నిలిపేశామనీ, వేరే సంబంధం చూసుకోవచ్చనీ నిష్కర్షగా వ్రాసేస్తాను. నీవేం భయపడనక్కర్లేదు. నాకుమాత్రం తెలియదనుకుంటే పిచ్చిదానా. ఇన్నేళ్ళు యింత ముద్దుగా పెంచి కడకు అల్లాంటి రాక్షసులచేతుల్లో పెడ్తాననుకుంటే? ఎన్ని వేలయినా కుమ్మరిస్తాగాని యీ సంబంధానికి నేనుమాత్రం ఒప్పుకుంటానా? ఇదుగో వెళ్తున్నాను. ఇప్పుడే వెళ్ళి వ్రాసొస్తాను. (నిష్క్రమిస్తాడు)

కామ : (వాసును కౌగిలించుకొని ముద్దిడుకుంటూ) అబ్బా - నా హృదయం యిప్పుడు కుదుటబడింది. నా నాయనకదే. నా బంగారుతండ్రివి కదే. (ఎత్తుకుంటుంది)

★

# మరణాంతాని వైరాణి

వెంకటరామయ్య పోగానే బంధువులంతా చేరి ముందుపని చూడండని తమ్ములను హెచ్చరించారు. సీతారామయ్య, తమ్ముడు సుబ్బారావుని రూపాయిలు పట్టుకురమ్మన్నాడు. తమ్ముడు కొంచెం గడసరి. ఆపైన అన్న పరిస్థితి తెలిసినవాడాయె. ధీమాగా 'నాదగ్గరేమీ లే'దన్నాడు. మరైతే ఏం చెయ్యాలి అనే సమస్య వేధించింది సీతారామయ్యను. చివరకు చనిపోయిన అన్నగారి స్వార్జితం ఎలాగూ 5 ఎకరాల కొండ్ర ఉండనే ఉన్నదిగదా, ఎక్కడేనా తాకట్టుపెట్టి పట్టుకురమ్మన్నాడు. వెంటనే సుబ్బారావు లోలోపలే సంతోషిస్తూ, షావుకారు తిమ్మయ్యసెట్టిదగ్గిర 300 రూపాయలు తెచ్చాడు. మొత్తంమీద ఎలా అయితే నేం కర్మకాండ నలుగురూ బాగా జరిగిందనేటట్లు పూర్తిచేశారు. చివరిరోజున సుబ్బారావు అన్నగారికి 301 రూపాయలు కర్చు చూపించేశాడు, ఉన్నవి కొన్నీ లేనివి కొన్నీని. నిజానికి రెండు వందలే అయినా అంకెల్లో చాలా మహాత్యం కనపడ్డది సీతారామయ్యకు. అయితే నేమి-లెక్క కట్టింది పైవాడుకనుకనా! ఏమనగలడు? సుబ్బారావు కొంచెం చదువుకొన్నవాడు "నీవాటా150 రూపాయలూ ఇస్తే నావంతు పూర్తిచేసి తాకట్టు విడిపించి చనిపోయిన అన్నగారి భూమి పంచుకుందా" మన్నాడు. అన్నదమ్ములు విడిపోయిన లగాయతు సీతారామయ్య ఏరోజు కారోజు గడుపుకొని పోతున్నాడేకాని వెనకకువేసే స్థితిలో ఉన్నవాడు కాడు. సుబ్బారావు అన్న లోకువ కనిపెట్టే ఉన్నాడు కాబట్టి "నీవంతు రూపాయలు ఎప్పుడిస్తే అప్పుడే నీవంతు భూమి యిస్తా"నన్నాడు. సరే అలాగే కానియ్యి" అన్నాడు చేసేదిలేక సీతారామయ్య.

కాలచక్రం గిర్రున తిరుగుతోంది. ముప్పైసంవత్సరాలు గడిచిపోయినా సీతారామయ్య చేతికి నూటయాభైరూపాయలు సమకూడనేలేదు. ఆ తరవాత సీతారామయ్య కొడుకు, జగపతిచేతికి అందివచ్చాడు. జగపతి సంపాదించినంతలోనే కూడబెట్టి, కష్టాతికష్టంమీద నూటయాభై చేసి, రెండెకరాలన్నర నిలబెట్టుకున్నామనుకొన్నాడు. పినతండ్రి దగ్గరకు చేరి "మా నాన్న ఇవ్వవలసిన సొమ్ము తీసుకొని భూమి నా పేర వ్రాయ"మన్నాడు.

ముప్పైయేళ్లనుండి భూమి మన భుక్తంలోనే ఉన్నదిగదా, ఇంక అన్నగారేమి చేస్తాడనే దిలాసాతో బంగారంపండిస్తున్నాడు సుబ్బారావు. తిండికి లోపం లేకపోతే మన దేశంలో మోతుబరికిందజమే. ఆ పైన ఊళ్లో నలుగురనూ మంచి చేసుకొన్నాడు. "నీచిత్తం వచ్చినట్లు చేసుకో, ఇన్నేళ్లయింది ఇంకెక్కడి భూమి అన్నాడు జగపతితో. ఇన్నాళ్లూ పడిన శ్రమ వృథా అయినందుకు జగపతికి మండెత్తింది. ఎందుకు రాదో చూస్తానన్నాడు జగపతి - మాటా మాటా పెరిగింది సుబ్బారావు నాస్తి శబ్దం చెప్పడంతోటే "నాకు లేకపోతే నీకంతకంటే లేకుండా చేస్తా"నని జగపతి శపథం పట్టాడు.

జగపతిది యువకరక్తం. తనకు రాకపోతే పినతండ్రి ఎందుకు అనుభవించాలి అనే ఆలోచన వేధించసాగింది. ఎక్కడో దూరాన ఉన్న సుబ్బప్ప ఇంటికి ప్రయాణం కట్టాడు. ఈవిడ అసలు వెంకటరాయ్యకూతురే. ఎప్పుడో చిన్నతనంలోనే తండ్రి పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించాడు. అప్పటినుండీ తండ్రి పోయినప్పుడొకసారి వచ్చి నలుగురితోబాటు కన్నీరుకార్చి పినతండ్రులు కర్మ ముగించాక అత్తవారింటికే వెళ్లిపోయింది. ఈలోగా భర్త పోయినాడు. పిల్లలు పెద్దవాళ్లయ్యారు. ఏదో ఇంత వేళకు తింటూ కృష్ణా రామా అనుకుంటూ రోజులు వెళ్లబుచ్చుతూ ఉండేది. ఈవిడను వెతికి వెతికి వచ్చి జగపతి పినతండ్రిపై దావా చెయ్యమన్నాడు. "నా కెందుకురా, ఏదో కలో గంజో కాలక్షేపం చేసేస్తున్నాను. దావాకు బోలెడు ఖర్చు పావసం, తీరా చేస్తే ఫలితం ఏమవుతుందో చెప్పలేము. సొమ్ముపోయి దిమ్మగొట్టినట్లు ఎందుకు వచ్చిన క్షోభ" అన్నదామె.

"అలా కాదు, తప్పకుండా మన దావా గెల్చి తీరుతుంది. పెట్టుబడి నే పెడతాగా, ఎలాగైనా చేసితీరాల్సిందే" అంటూ తన పట్టుదల చెప్పాడు.

శ్రీ పి. వి. భట్టుశర్మ

"సరేఅయితే, కాని నాదగ్గిర చిల్లుగవ్వ లేదన్నదామె. ఎట్లా అయితే నేం, పెట్టుబడి ఖర్చంతా తాను పెట్టుకోడానికి ఒప్పన్నమై ఆమె పేరుతో మునసబుకోర్టులో సుబ్బారావుపై దావా దాఖలుచేశాడు. దావా అంటే వేశాడు కాని, జగపతికి అనుభవం శూన్యం. సాక్ష్యాలు సంపన్నాలకోసం అయిదువందలారిపోయాయి. అవతల సుబ్బారావు ఊళ్ళో నలుగురనూ ఆకట్టుకొని పైసా కర్చుకాకుండా చనిపోయిన తన అన్న వెంకటరామయ్యకు సుబ్బప్ప అనే కూతురే లేదని పెద్దమనుష్యులచేత సాక్ష్యం ఇప్పించేసరికి కొట్టివేస్తూ ఫిర్యాదిలను కర్చులు ఇచ్చుకోమన్నాడు మునసబు.

ద్వేషం రాకూడదేగాని వస్తే అంతతో ఆగుతుందా? జగపతి అసలే పట్టుదల మనిషి. ఉన్నదాంట్లో ఒక ఎకరం అమ్మేసి జిల్లాకోర్టుకు కాళ్లరిగేటట్టు తిరిగి ప్లీడర్లనూ గుమాస్తాలనూ ఆశ్రయించి, సంతోషపెట్టి తన పక్షం అయిందనిపించుకొనేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. సుబ్బారావువంటి పరువు ప్రతిష్ఠలుగల వ్యక్తి అంతటితో ఆగిపోతాడా? నలుగురి మాటలకు తలయొగ్గి తన పరువుకు భంగం కలిగిందనుకుని హైకోర్టుకు పరుగెత్తాడు. జగపతి యింకో ఎకరం అమ్మి, యింట్లో ఆడవాళ్ల వస్తువుల నమ్మించి హైకోర్టులో తన పార్టీకే విజయం అనిపించుకొన్నాడు కాని కాళ్లు చల్లబడ్డాయి.

చివరకు భూమి స్వాధీనం చేసుకోడానికివచ్చిన సుబ్బప్ప నాలుగురోజులు సీతారామయ్య ఇంట్లో మకాము వేసి నలుగురు రైతులనూ కలుసుకొని ఎవళ్లు ఎక్కువ శిస్తు ఇస్తామంటే వాళ్లకే భూమి అమరకం చేసివేసింది. "ఇంత కష్టపడినదీ ఇందుకేనా! నాలుగేళ్లపాటేనా భూమి నాకివ్వవా" అన్నాడు జగపతి. ఊళ్ళోవాళ్లిస్తామన్నదానికి పది పదిహేను రూపాయిలు తగ్గించి పుచ్చుకుంటే అభ్యంతరం లేదన్నది సుబ్బప్ప. పోయిన ఆస్తి ఎట్లాగూ పోయినది. ఇది మనల నుద్ధరిస్తుందా అని జార్చేశారు జగపతీ సీతారామయ్యాను. కాని రోజులు వెళ్ళేదెలాగ? ఇంట్లో గిన్నెలకు, చెంబులకు కాళ్లు వచ్చాయి. తండ్రీ కొడుకులు రెక్కాడితేనే డొక్కాడుతుం

వనే స్థితికి వచ్చారు. వృద్ధాప్యంలో సీతారామయ్య తన పరిస్థితికి కొడుకును చీదరించుకోవడం ప్రారంభించాడు. "మొదట్లో నే నువ్వు వద్దన్నట్లైతే నే నింతవఅకు వెడుదునా" అని యెదురు తిరిగేవాడు జగపతి. రోజులు దొర్లిపోతున్నాయి.

హైకోర్టులో అపజయం పొందడంతో శే సుబ్బారావు వ్యవహారం చితికింది. బంగారంపండే భూమి వదలవలసిరావడం, చేతిలో పైసా ఆరిపోవడంతో మనోవ్యథ ఎక్కువై మంచం పట్టాడు. సుబ్బారావుకు ముగ్గురు కూతుళ్లూ ముగ్గురు కొడుకులూ. ఆడపిల్లల పెళ్ళిళ్ళకు కొంత హరించిపోయింది. మోతుబరితనం నిలబెట్టుకోవాలాయె. కుర్రాళ్ళు చేతికి అందివచ్చిన వాళ్ళు కాదు. ఒక్క రెక్కతో సంసారం ఈదడం కష్టమైపోయింది. క్రమంగా ఈ విచారంతో జీవయాత్ర చాలించాడు. సంసార భారమంతా సుబ్బారావుభార్య నెత్తిపై పడ్డది. ఆవిడ కొన్నాళ్ళు చూచింది. ఇంట్లో తిండివచ్చే యెత్తు కనపడక ముగ్గురు కూతుళ్లదగ్గరకూ ముగ్గురు కొడుకులనూ పంపి తాను ఎలాగో కాలక్షేపం చేద్దామని అభిప్రాయపడ్డది. అప్పగార్లు తమ్ముళ్ళను ఎంతకాలం భరించ గలరు ? అత్తింటి కోడళ్ళాయె. మూడు నెలలు వాళ్ళను బాగా చూచినా తర్వాత చీదరించుకోడం ప్రారంభించారు చివరకు కుర్రాళ్లు తల్లిదగ్గరకు చేరక తప్పిందికాదు. ఆమె జీవితం నానాటికి దుర్భరమౌతున్నది.

కుర్రాళ్లు ఊరివాళ్ల పొలాల్లో చెరుకుగడలు ఎత్తుకువచ్చి, మొక్కజొన్న పొత్తులు దొంగిలించి ప్రాణం కాపాడుకో సాగార్చు ఆ వృత్తి ఎన్నాళ్లు దాగుతుంది? రైతులు కుర్రాళ్ళను పట్టుకువచ్చి తల్లియెదుట పెట్టి చివాట్లు పెట్టేవారు. ఎదుటి గుమ్మంలో ఈ అవస్థ అంతా చూస్తున్న జగపతికి జాలి కలిగింది. ఎంత చెడ్డా పినతండ్రికొడుకులు. విరోధాలు వచ్చాయి కాని రక్తసంబంధం ఎక్కడికి పోతుంది ? ఎదురుగా సాయం చేస్తే పినతల్లి సమ్మతించదేమో ! చాటు చాటున కుర్రాళ్లకు ఏమన్నా పెడుతుండేవాడు. అప్పటప్పట డబ్బులిస్తూండేవాడు. కుర్రవాళ్ళకు నోరుతియ్యబరిచేవాళ్ళే బంధువులుగదా మరి ! అన్నయ్య - అన్నయ్య అంటూ దరిచేరేవాళ్లు. పినతల్లికీ సంగతి తెలిసింది. మొదట్లో జగపతిహృదయం తెలియక సందేహించింది. క్రమంగా జగపతి ప్రవర్తనలో మార్పుకు సంతోషించింది. సీతారామయ్యకు కూడా కొడుకు చేస్తున్న సహాయం తెలియవచ్చింది. జగపతిని పిల్చిగద్దించాడు. "మనవైరంచిన్నాన్నతోనే సరి. కుర్రవాళ్లమీదనా మన ప్రతాపం ?" అన్నాడు జగపతి. 'మరణాంతాని వైరాణి' అని సమాధానపడ్డాడు సీతారామయ్య— ★



# విజ్ఞానవీధులు

## "డాక్టర్"



### గమనిక

"పాఠకులవద్దనుంచి విజ్ఞానమునకు సంబంధించిన ప్రశ్నలు వచ్చుచున్నవి. వాటి సమాధానాలు పెద్దవైతే "విజ్ఞానవీధుల" లోనూ, చిన్నవైతే "ప్రశ్నలూ - సమాధానాలు" లోనూ చూసుకోమని వినతి.

—సంపాదకుడు.

## 21. కళ్లు రెండెందుకా?

ఒక్క పెద్దకన్ను చాలదా అనీ? "రాక్షసుల్లాగ కనపడమా?" అంటారా? నోరు ఒకటే వుందికాదూ? రాక్షసుల్లాగ కనపడుతున్నామా?... మనుష్యులకే కాదు, జీవజంతువుల కన్నిటికీ రెండేసి కన్నులే వున్నాయి. ఎందుకుందీ ఇలాగ? తెలుస్తుంది; ఒక చిన్న ప్రయోగము




చెయ్యండి. చీపురుపుల్లలు ఒక పాత్రలో పోసిన బియ్యంలో గుచ్చండి. పుల్లలు ఆశ్చే పొడవు ఉండనక్కరలేదుగాని అన్నీ అన్నిముఖాలకీ చూపించేటట్టు గుచ్చండి. ఈ పాత్రని మీరు నాలుగు అడుగుల దూరంలో పెట్టండి. ఒక రాగి తీగ బొమ్మలో సూచించినట్టు వంచండి. కొసాని కొంత ఎక్కువ వంచి కన్నులాగ చెయ్యండి. ఇప్పుడు ఒక చేత్తో ఒక కన్ను మూసుకోండి. ఒక్క కన్నేకదా చూస్తోంది ఇప్పుడూ? రెండో కన్ను లేని నష్టము కనపరచాలి కాదూ? తీగని 'ప' దగ్గర పట్టుకుని నాలుగడుగులు దూరంనించి 'క' అనే కన్నుని ఏదో ఒక చీపురుపుల్లకి దూర్చండి మొదటి యత్నంలో దూర్చలేరు. రెండూ, మూడూ యత్నాలు చెయ్యండి "ఈపుల్లకి దూర్చ"మని పురమాయించడానికి ఇంకొక రెవరేనా వుంటే మరీ మంచిది. మీలాగే యత్నం చేశే వాళ్లు నలుగురైదుగురుంటే తమాషా బాగా చూడవచ్చును. రెండు కళ్ళూ తెరచి చూస్తే 'క'ని చీపురుపుల్లచుట్టూ అమర్చడము చిక్కలేదు. అంటే ఏమన్నమాటా? ఒక కంటితో చూస్తే చీపురుపుల్ల ఎంత దూరం వుందో తెలీదు. రెండు కళ్ళూ తెరిస్తే తెలుస్తుంది.

వస్తువులు ఇంత దూరంలో వున్నాయని తెలుసుకోడానికి రెండుకళ్ల దృష్టి అవసరం.

## 22. రాత్రిపూటా, నీటిమీదా శబ్దం చాలాదూరం వినిపిస్తుందేం?

రాత్రిపూట దూరపు శబ్దాలు—పగలు వినపడనివి—చక్కగా వినపడతాయి. కోనేరులదగ్గర అవతలిగట్టున కబుర్లు చెప్పుకునేవారి మాటలు స్పష్టంగా వినబడతాయి. అవే మైదానంలో అయితే అంత చక్కగా వినపడవు. ఎందుచేత?

శబ్దం చల్లనిగాలిలోకంటె వేడిగాలిలో వేగంగా ప్రయాణిస్తుంది ఒకటీ; నీటిమీదా, రాత్రిపూట నేలకి చేరువన చల్లగా వుంటుంది రెండూ; కిటుకులు ఈ ప్రశ్నకి జవాబు చెప్పడానికి.




ఒకటో పటములో 'కచ' అన్నది రాత్రి నేలకి చేరువగానూ, లేదా చల్లని కోనేటి నీటికి రాసుకుంటూనూ, ప్రయాణించే శబ్దకిరణము. 'టత' అన్నది కొంచెం ఎత్తుగా కొంచెం వెచ్చని గాలితో సాగిపోయే కిరణం. ఇది 'క' తో సమంగానే బయల్దేరినా, గాలి వెచ్చదనము కొంచెం ఎక్కువ కావడముచేత 'చ' కన్నా ముందుకు సాగింది. 'పమ' అన్నది ఇంకా ఎత్తున సాగే శబ్దకిరణము. వీటి ముక్కల్ని కలిపే 'చతమ' శబ్దతరంగముఖము. పోనుపోనూ, 'పమ' 'టత' ల ఆధిక్యమువల్ల రాత్రిపూట బయలుదేరిన శబ్దతరంగము భూమివైపు తిరిగిపోతోంది. అందువల్ల దూరంనించి వినడానికి వీలౌతుంది. రెండో పటములోని 'గస' 'డద' 'వహ' లు పగటిపూట—అనగా నేల వెచ్చగా ఉంటే పరిస్థితులలో - ప్రయాణించే శబ్దకిరణాలు. ఇప్పుడు శబ్దతరంగము భూమిమీదినుంచి లేచిపోతున్నది. కనక పగటిపూట శబ్దాలు భూమినంటి దూరం ప్రసరించలేకపోతున్నాయీ, మనం వినలేకపోతున్నాము.

స్త్రీలు వాళ్ళకు సిగ్గు ఎక్కువ. భర్తల వద్దనే సిగ్గుమానలేరు. మనం-మొగవాళ్ళం చాటూ మాటూ లేకుండా రహస్యాలు మాట్లాడుకుంటాం... అదే అసలు కిటుకు...స్త్రీలు మరీ యింత పిరికివాళ్ళుగా కనపడ్డానికి. ప్రతీదానికీ తెరమరుగ్గా ప్రవర్తించడంలోనే ఉంది అసలైన ఆకర్షణ...వాళ్లు అలా సిగ్గూ-బెరుకుతనం, భయమూ ప్రదర్శిస్తే, మగవాళ్ళు ఆ సిగ్గుచూసి ముగ్ధత్వమనీ అమాయకత్వమనీ,అభయం స్త్రీ సహజమైన భీరుత్వమనీ భావించి, తమ ధైర్య సాహసాల వల్లనే స్త్రీలను మిత్రులుగా చేసుకుంటున్నామనీ, ఆ స్త్రీలను రక్షించి వారి హృదయయాలను చూరగొంటున్నామనీ గర్విస్తారు. ఆ గర్వం పొడుకున్న హృదయంతో భార్యలను పసివాళ్ళలాగానూ, సేవకులుగానూ, అరక్షితలుగానూ, తమకు ఆశ్రయులుగానూ లోకువయిన దృష్టితో సాకుతారు. అలా తమ ఆధిక్యతను శాశ్వతపరుచుకుంటేగాని, మగవాళ్ళకి తృప్తి వుండదు."

మా అన్నయ్యతోపాటు కాలేజీనుంచి వచ్చిన స్నేహితుల్లో ఒకరు మిగతావారికి మన స్తత్వాలను ఇలా విడమరచి చెబుతున్నారు. మరొకాయన షేక్స్పియర్ డ్రామాని టీపాయ్‌మీద వేసి కొడుతూ, "నువ్వు వెయ్యి చెప్పు-లక్ష చెప్పు ఆడవాళ్ల దంతా, మూర్ఖతా, మంకుతనమూ, మడ్డితనమూ తప్ప మరోటి కాదంటాన్నేను. లేకపోతే-రోజూ కలసి మెలసి గడిపే భర్తతో కూడా బెరుగ్గా చాటుగా చరించడంలో అర్థమేమిటి? వాళ్ళకి భర్తల కోర్కెలనూ, కులాసాలనూ-అనుసరించి నడుచుకునే మంచితనం లేదురా - ఏకోశానా లేదు. ఆ మంచి బుద్ధే ఉంటే-మొన్నటికి మొన్న-నా భార్య-ఎంత బతిమలినా, ఎంత భయపెట్టినా, ఏమేం చెప్పినా-నాతో పార్కుకు రాకపోవడానికి కారణంఏమిటి?" అని శకొయించారు.

మూడోస్టూడెంటు-"బజారులో నలుగురూ చూస్తారని సిగ్గూ బిడియమూ కాబోలురా పనీ భార్యకీ-పల్లెటూరి పిల్లయ్యే" అని సమర్థించాడు.

స్త్రీలనిమూర్ఖుల క్రింద జమకట్టి నాయన: "నీ బొంద...నలుగురూ చూస్తే పోయిందేమీ లేదనీ, తన నెవరూ కొరుక్కు తినరనీ, భార్యాభర్తలు కలిసి తిరగడం తప్పు కాదనీ, నా ఆనందంకోసమైనా నువ్వు రాకతప్పదనీ ఎన్నో చెప్పినా అదే పట్టుదలాయె" అని భార్యమీద విసుగు వెలువరించారు.

మొదట మాట్లాడిన మనస్తత్వ సిద్ధాంతి: "అదీఅసలు సంగతి...నీ ఆశ యేమో-యీ అందాలకుందనపుబొమ్మ నా భార్య-అని పదిమందిలోనూ ప్రదర్శించుకోవాలనే ఉబలాటం! ఆమె పెంచబడ్డ వాతావరణమూ, సంస్కృతీ, పదిమందిలోనూ తిరగడం సిగ్గుచేటని భయపెట్టేది...మరి మీ యిదరికీ లంగరు కుదురుతుందా?.. కుదగదనుకుంటున్నావా? ఎందుకు కుదరదు? నువ్వు ఆమె సంస్కారాన్ని పెంపొందించాలి. ఆమెకు సామాజిక సత్యాలను గురించి విడమరిచి చెప్పాలి. ఆమె కూడా నీ దృక్పథం నేర్పాలి...అప్పుడు నీతో పార్కుషైర్లకే కాదు, మరెక్కడికైనా సరే రావటానికి సిద్ధపడుతుంది" అని చెప్పారు.

వాకాయన చెబుతున్న విధానమూ, విశేషమూ పూర్తిగా నచ్చాయి. దువ్వుకుందామని విరబోసుకున్న తలా, చేత పుచ్చుకున్న దువ్వెనా అలానే ఉండిపోయాయ్. తీసిఉన్న కిటికీ తలుపులగుండా యువకుల్ని చూస్తూ డ్రెస్సింగ్ టేబుల్

"అవును మీ అన్నయ్యా మెత్తనే, నువ్వా





మెత్తనే నోయ్" అంది వదిన మూతి ముడిచి.

ముందు నుంచుని ఉన్నాను. వాళ్ళ సంభాషణ ఇంకా వినబడ్డుతూనే ఉంది. నాలుగయిదు రోజుల్లో కాపురానికి వెళుతున్న నాకు యీ సంభాషణలు కొంత సాయ పడేట్టుగావున్నాయ్. కాని— యింతవరకూ ప్రక్కగదిలో దుస్తులు మార్చుకుంటూ వదినెతో కిలకిలలాడుతున్న అన్నాయి వచ్చి మిత్రులను... "టయిమవుతూంది – పదండ్రా–ఈ ఫ్రాయిడ్ తీరీలూ, సంసారపులకలుకలూ తర్వాత వినొచ్చు" అంటూ తీసుకుపోయాడు.

ఏవో గొప్పవిషయాలు విందామని కుతూహల పడ్డ నేను నిరాశపడక తప్పిందిగాదు. మనస్తత్వాల్ని పరిశీలించినట్లు చెప్పి నాయనమాటలు యింకా నా చుట్టూముసురుకుంటూనే ఉన్నాయి...,నిజానికి భార్యాభర్త లొకరినొకరు అర్థం చేసుకోవడమూ; తెలియజేసుకోవడమూ, దాంపత్య శోభకు దారి తీస్తాయిగాని; ఒకరినొకరు అర్థంచేసుకోకుండానే, ఒ... టూవుంటే ఏంజరుగుతుంది? నిరంతరం రవరవలూ, మూతివిరుపులూ, చివాట్లూ, దెప్పళ్లూ...ఛీ ఏం బ్రతుకులవి? పరస్పరం ఆనందం చేకూర్చుకోవలసిన దంపతులు నిరంతరం శత్రువులుగా చరించడమా? అందుకనే మనదేశంలో ప్రతీకుటుంబములోనూ ఏదో తీరని అశాంతీ, ఎప్పుడూ లకలుకలూ! వీటితోనే సమాప్తిమనజీవితాలు.

జడ వేసుకుంటూ ఇలా అనుకుంటున్నాను. మనసులో నాకు తెలిసిన దంపతులందరి జీవితాలూ తిరగవేసుకుంటున్నాను. ఒక్క జంటైనా పరిపూర్ణతృప్తి పొందుతున్నట్లు కనిపించటంలేదు. నటించడం చేతనయినవాళ్లు చూచేవాళ్ళకి ఆదర్శమైన జంటగా కనిపించవచ్చుగాని–లోపల, లోపల ఏదో ఒక భిన్నాభిప్రాయం; దాని సాకుగా, లకలుకలూ వుండకపోవు. మరి–దీనికంతటికీ కారణం స్త్రీయా పురుషుడా అంటే, ఒక్కరేనని చెప్పలేం...కొన్నిపట్ల స్త్రీవల్ల లోపం అయిఉండవచ్చు. కొన్నిపట్ల పురుషదోష్యం అయి ఉండవచ్చు.. మొత్తంమీద ఇద్దరిలో లోపాలుంటేగాని ఈ లకలుక లేర్పడవు.

బొట్టు పెట్టుకుంటూ వుండగా మావదినె వచ్చింది. "అయితే–మీ అన్నయ్యెక్కడికెళ్లారోయ్?" అంది.

"ఇదేమిటి? అర్థాంగివి నీతో చెప్పకుండా, నాకు చెప్పి వెళ్ళాడా ఏమిటి?" అని అడిగాను.

"అబ్బో–అంత స్వారస్యంకూడానా మీ అన్నయ్యకూ?" అన్నది వదిన...

"ఏం-నువ్వు చెప్పేనమాటకు కాదనడుగా? అంతేలే...మెత్తనివాడు గనుక ఎన్నయినా అంటావ్!" అన్నానేను.

"అవును. మీ అన్నయ్యా మెత్తనే, నువ్వూ మెత్తనేనోయ్. అంతగా నామాట వినేవారు గనుకనే ఇంత సోయగంగా ఉంది నా బతుకు." అంది మూతి ముడిచి.

"ఇప్పుడు నీకేం తక్కువ వదినా? నువ్వడిగిందల్లా తెస్తూనే ఉన్నాడుగా మా అన్నయ్య."

"అవును-రెండునగలు చేయించేసరికి నన్నేదో ఉద్ధరించేశారంటున్నావ్... నువ్వు నా కన్నవారిచ్చిన కట్నానికి వడ్డీకూడా గిట్టదీ పెట్టుబడికి. అది నువ్వెందుకెత్తుతావూ?" అని నిష్టూరం వొలికించింది ఒదిన...

"అసలా డబ్బంతా నీపేరే బేంక్‌లో ఉందిగా ఒదినా.. ఇంకా వడ్డీ తింటున్నదెవరూ?-అయినా మొన్న మరో నెక్లెస్ చేయించుతానంటే నువ్వే వద్దంటివిగా?" అన్నానేను, అన్నయ్యపక్షంగా.

"ఇహ బతుక్కి నగలేనా కావలిసింది?

(48-వ పేజీ చూడండి)




# బజారు వింత

శ్రీ తుళ్ళూరి రామమోహనరావు

పండగనాడు పిండివంటలకు
బజారువెచ్చం తెచ్చేటందుకు
స్నానసంధ్యలు సాగించుకొని
పయనమైతిని బజారుకు.

కూరగాయల మార్కెటులో
కూరలు బేరం చేస్తుంటే
ప్రక్కనవున్న మిఠాయిషాపులో
కలకలమేదో పుట్టింది.

ఆ వింతేమో చూచేటందుకు
కూరలబేరం చాలించి
మిఠాయికొట్టు వైపుకు నేను
ఆత్రంతో పరుగెత్తిపోతిని.

అచ్చటిజనులు గుంపుగ గూడి
బాలునొకనిని పట్టుక తెచ్చి
ఎవరికితోచిన రీతిని వారు
గుద్దులబెల్లం పెట్టుచుండిరి.

గుంపులోఒకనిని. వేగమె పిలిచి
'సంగతేమిట'ని ప్రశ్నించితిని
'వీడేఆలడ్డుండను తీశాడని'
చితికిపడిన ఆ వుండనుచూపెను.

అక్కడకొచ్చిన ఒకసూటాయన
సంగతేమిటో తెలిసినమీదట
'దొంగవెధవను' తన్నాలంటూ
తానాపనినే మొదలెట్టాడు.

కూరగాయల సుబ్బయ్యంతలో
సూటాయన దగ్గర జేరి
'ఎవరయ్యా దొంగవెధవనీవా,
వాడా !
అంటూధీమాగా అడిగేశాడు.

'బుట్టెడుకూరలు నాకొట్లోకొని
బేరపుసందడి నేనుండంగ
డబ్బివ్వకయే పారివచ్చినా
దొంగవు నీవా, తెలియని ఆ
కుర్రడా ?

ఈ వింతంతా చూచినమీదట
నే నాశ్చర్యంలో మునిగితేలితి
లోకంపోకడ తలపోస్తూ
నే నింటిదారిని పట్టితిని.




# డాన్ క్విక్ సెట్

### పూర్వకథ

లామంచా అనే గ్రామానికిచెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకడు తనుకూడా ఒకవీరుడు (నైట్) గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాంటె' అనే ఒక కుంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకుతానే 'డల్ సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. ఆమెమన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో వెర్రివెర్రి ఆశలుచూపి శాంకోపాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు. వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్విక్ సెట్ ఏవేవో సాహసకార్యాల చేయబోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ఒకరోజు చీకటిపడ్డాక, చావుపూరేగింపు ఒకటి తారసిల్లితే, ఆ వూరేగింపులో వున్నవాళ్లందరినీ డాన్ క్విక్ సెట్ గారు బెదరగొట్టారు. వాళ్లంతా పారిపోయారు. అదిచూచి శాంకోపాంజాయే ఆయనకు 'భీకరానన వీరశూరాగ్రేసరుడ' నే బిరుదాన్ని యిచ్చివేశాడు. ఆ మరునాడు మంగలివాడొక యిత్తడిబొచ్చెను నెత్తిన బోర్లించుకు వస్తుంటే, వాడిని హడలగొట్టి, డాన్ క్విక్ సెట్, ఆ బొచ్చెను తను స్వాధీనపరుచుకొన్నాడు. అది మామూలు యిత్తడిబొచ్చె కాదనీ, మెంబ్రినో రాజుగారి మహత్తుగల బంగారు కిరీటమే యిదిఅని డాన్ క్విక్ సెట్ నమ్మాడు.

## 9

వాళ్లిద్దరూ అలా సరదాగా కబుర్లు చెప్పుకొంటూ కొంతదూరం పోయారు. ఇంతలో వాళ్లకు గుంపుగా వస్తున్న మనుష్యులు కొందరు కనుపించారు. ఆగుంపులో డజనుమందిదాకా కాలినడకను వస్తున్నారు. ఇద్దరు మాత్రం పోలీసులకుమల్లే దుస్తులు వేసుకొని, గుర్రాలు ఎక్కి వస్తున్నారు. కాలినడకను వస్తున్న ఆ డజనుమందికీ, కాడికి కట్టిన ఎద్దులకుమల్లే, మెడలకుయింతలావు యినపగొలుసు తగిలించారు. ఆ ముందువైపు గుర్రాలమీద వస్తున్న వాళ్లిద్దరు కాక, ఆ మందకు వెనుకవైపునకూడా మరొక యిద్దరు పోలీసులు నడిచి వస్తున్నారు.

"పాపం! ఎవరో ఖైదీలు కాబోలు! రాజుగారు వీళ్లందరికీ శిక్షలు విధించి పంపుతున్నట్లున్నారు." అంటూ శాంకో పాంజా తన జాలిగుండె వెళ్లబెట్టాడు.

"అట్లనిన, రాజుగారు వీరందరినీ బలవంతముగా కారాగారవాసమునకు పంపుచున్నారనియే కదా అర్థము?" డాన్ క్విక్ సెట్ గారు తన అతితెలివి వెలగబెట్టారు.

"వీళ్లంతా ఏవేవో నేరాలు చేసివుంటారు. అందుకనే అధికారులు వీళ్లకు శిక్షలు విధించివుంటారు."—శాంకో పాంజా తనకుగల లౌకిక జ్ఞానాన్ని వుపయోగించాడు.

వాళ్లంతా ఏవేవో నేరాలుచేసి వున్నందువల్లనే వాళ్లకీ శిక్షలు పడివుంటాయని ఆ బంటుగాడికి తోచిన మాత్రమైనా, యీ 'భీకరానన వీర శూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ గారికి తోచలేదు. తోచకపోగా "వీరి యిష్టాయిష్టములతో ప్రమేయము లేకనే అధికారులు వీరిని కారాగారములకు పంపుచున్నారు కదా? దుష్టశిక్షణ, శిష్టరక్షణలు మాత్రమేకాక, పీడితప్రజానీకమునకు సేవచేయుటకూడా వీరధర్మములలో నొకటి గావున, నేనిదేపోయి, నిర్బంధవిధిని శిక్ష ననుభవింపబోవుచున్న యీ మానవ సమూహామును అధికారుల హస్తములలోనుండి విడిపించి, వారికి స్వేఛ్ఛాస్వాతంత్ర్యముల ప్రసాదించెదగాక!" అంటూ హెచ్చులు పోయాడు.

తన యజమాని మళ్లీ యీ దగుల్బాజీ వ్యవహారంలో తానూ యిరుక్కొని, తననీ యిరికించ

అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

బోతున్నాడని పసిగట్టిన శాంకోపాంజా, ఆయన కాళ్లకు అడ్డంపడి, "మహాప్రభూ! నామాట వినండి. అధికారులు వీళ్లకు శిక్షలు అనవసరంగా వెయ్యలేదండీ! వీళ్లు చేసిన నేరాలకు శిక్షలు విధించటం ధర్మమేనండీ మహాశయా!" అంటూ ఎంతగానో బ్రతిమాలి చెప్పాడు.

అయినా సరే-యీవీరుడు బంటుగాడి మాటలు లెక్కచేయక, ఆ గుంపు దగ్గరకు వచ్చాక, వాళ్లను ఆగమన్నాడు. వాళ్లూ ఎందుకనో ఆగిపోయారు. డాన్ క్విక్‌సెట్ ఆ పోలీసుల్లో ఒకడికిదగ్గరగా తన గుర్రాన్ని పోనిచ్చి "అయ్యా! వీరికి యీ దుర్గతి ఏల పట్టినదో అడిగి తెలుసుకొన నాకు ఆనతి యిండు !" అని కోరాడు. ఆ అధికారి సరే అన్నాడు.

మెడలకు తగిలించిన యినుపగొలుసు బరువుకు ఆ డజనుమందీ నేలకు ఒరిగిపోతున్నారు. అలాటి వాళ్ళలో మొదటివాణ్ణి డాన్ క్విక్‌సెట్.గారు అడిగారు "నీకీ దుర్గతి ఏల కలిగె?" అని.

వాడెంత చతురుడో—'ప్రేమించినందువల్ల నే' తన కింతటి దుర్గతి పట్టిందని వెళ్లబోసుకొన్నాడు.

"ఏమేమీ! ప్రేమే నేరమౌనా? ప్రేమే నేరమైన నేనునూ శిక్షార్హుడనే! నేనుమాత్రము ఆ అనన్యరూపసి, అందాల రాణి,ముత్యాలకోవ 'టొబోసో రాజ్ఞి డెల్‌సీనియా' కన్యను ప్రేమించుటలేదా !" అంటూ డాన్ క్విక్‌సెట్‌గారు, దాక అల్లే నోరు తెరిచి, ఆశ్చర్యపోవటం మొదలుపెట్టారు.

ఇంతలో ఆ కొరతనుబడ్డవాడు కల్పించుకొని, ప్రేమ అంటే, తనది అల్లాటి ప్రేమ కాదనీ, తనవికాని విలువైన ఒక బట్టలమూటపై తన మనసు ఎందుకో అవ్యాజంగా తగుల్కొన్నదనీ, అలా తగుల్కొనిపోయిన మనస్సును తను ఎంతకీ తిరిగి వూడలాక్కోలేక, ఆ బట్టల మూటనే ఎత్తుకుపోయాననీ, తాను చేసిన నేరమల్లా అదేననీ యీ వీరుడికి వివరించి చెప్పాడు.

మిగిలిన బందీలు కూడా యిలాగే తాముచేసిన పనులేవో చెప్పుకొన్నారు. ఒకడు ఆవులను దొంగలించానన్నాడు; యింకొకడు డబ్బులసంచులు కొట్టేశానన్నాడు ; మరొకడు కన్నాలు వేశానన్నాడు. ఇలా అందరూ చిన్నవీ, పెద్దవీ నేరాలు చేసినట్లు చెప్పుకొన్నారు.

అందరికంటే చివర ఒకడు వున్నాడు మిగిలిన వాళ్లందరూ ఒక యెత్తు ; వీడొక్కడూ ఒకయెత్తు. వీణ్ణి మిగిలిన వాళ్లందరికంటేకూడా ఎక్కువ పకడ్‌బంద్‌గా కట్టేశారు. వాడికి ఆపాదమస్తకం యినుపగొలుసులు తగిలించారు. ఆ గొలుసులు ఎంత అడ్డదిడ్డంగా కట్టేశారంటే, వాడికి నోటిదగ్గరకు చెయ్యిపోవటానికీ వీల్లేదు ; చేతిదగ్గరకు నోరూ రావటానికీ వీల్లేదు ! మనిషిమాత్రం మాంచి ఒడ్డూ, పొడుగూ వున్నాడు. వాడి ఆకారం, రంగూ అదీ అంతా మాంచి హుందాగా కనుపిస్తున్నాయి. కంట్లో ఆ మెల్ల కాస్తా లేకపోతే వాణ్ణి పెద్ద అందగాడనే అనవచ్చు. మనిషి మొఖంలోమాత్రం మాంచి పొగరుబోతుతనం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది.



మిగిలినవాళ్ళందరికంటే వీణ్ణి యింత గట్టిగా గొలుసులతో కట్టిపడేశారేమా అని డాన్ క్విక్‌సెట్ గారికి ఆశ్చర్యంవేసింది. ఆ అధికారిని అడిగాడు, వీడి ప్రత్యేకత ఏమిటని. మిగిలినవాళ్ళందరూ కలిసి ఎన్నెన్ని నేరాలు చేశారో, వీడొక్కడూ అన్ని నేరాలు చేసివుండటమే వీడి ప్రత్యేకత అని ఆ అధికారి చెప్పాడు. వాడిపేరు 'గైన్స్-డి-పసామాంటీ' అని, వీ డంత దగుల్బాజీ, లుచ్ఛా మరొకడు వుండ బోడనీ, వీడికి వున్న టక్కరితనానికి వీడు తప్పించుకు పారిపోవడానికి వీలు లేకుండా, యింత కట్టుదిట్టంగా కట్టిపడేశామనీకూడా ఆయన చెప్పాడు.

ఏదో యింతసేపూ వాళ్ళతో మర్యాదగా మాట్లాడుతున్నాడుకదా! అంతటితో వాళ్ళను యీ డాన్ క్విక్‌సెట్‌గారు పోనిచ్చినా బాగుండేది. అట్లా కాకుండా ఆ పోలీసుఅధికారులతో అర్థంలేని వాదనకు దిగాడు.

"అయ్యా! ఓ అధికారీ! దురదృష్టవంతులైన వీరిలో ఏ ఒక్కరునూ వ్యక్తిగతముగా నీపట్ల అవమానకరముగా ప్రవర్తించి యుండలేదుకదా! నీ సొమ్ము అపహరించియుండలేదుకదా! నీపట్ల చెడుగా ప్రవర్తించని వీరు, నేరము చేసిరని ఎవడో న్యాయాధికారి అనినంతమాత్రమున, నీవా మాటను విశ్వసింపవలసిన దేనా? ఆ న్యాయాధికారి మాత్రము పొరపడి యుండలేదను నమ్మకమే? నామట్టుకు నేను, ఆ న్యాయాధికారిఎవడో వీరి చర్యలను అపసవ్యముగా అర్థము చేసుకొన్నాడని త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాను. కాన వీరందరిని తక్షణమే విడుదలచేయుము. మంచిగనూ, మర్యాదగనూ నే చెప్పెడి యీ విషయమును నీవు పాటించవేని, యీ భుజబలము, యీ ఖడ్గధార నీకుబుద్ధిని తెప్పించగలవు. జాగ్రత" అంటూ భుజాలు చరుచుకొంటూ, మీసాలు మెలివేసికొంటూ హుంకరించాడు.

వాళ్లు అసలే పోలీసులేమో— ఈయనగారి యీ ధోరణిచూసేసరికి ఆ నలుగురు పోలీసుల్లో ఒకడికి చిర్రుఎత్తుకొచ్చింది.

"ఏయ్! ఎవరు నువ్వు! బందీలందరినీ వదిలెయ్యమంటావేం? వదిలెయ్యటానికి మాకు అధికారం వున్నదా? వదిలెయ్యమనటానికి నీకు అధికార

మున్నదా! వెర్రివాగుడు కట్టిపెట్టి, ఆ యిత్తడిబొచ్చె నెత్తిమీద సరిగా బోర్లించుకొని నీ దారిని నువ్వు, నోరుమూసుకు నడు" అంటూ రోడ్డు చూపించాడు.

డాన్ క్విక్ సెట్ గారు యీ అవమానాన్ని భరించలేకపోయారు. తనను అంత చులకన చేసి మాట్లాడుతున్న వాడిని కసిదీరా తిట్టి పారేద్దామని పళ్లు పటపటకొరికి, "ఓరీఖరా! ఖరశేఖరా! మూషికమా, మార్జాలమా, గార్దభమా!...గాండివమా!" అని బిగ్గరగా అరిచేశాడు. వీరగ్రాంధిక భాషలో యింకా బరువైన తిట్లుఏమైనా తట్టుతాయేమో, వాటినన్నిటినీ వీడిమీదికి దొర్లించి, ఆ తిట్ల బరువుకే వీడు లొంగిపోయేట్లు చేసిపారేద్దామని యీయన ఎంతో ఆరాటపడ్డాడు. ఎంత ఆరాటపడ్డా, ఆ నాలుగైదు ముక్కలకు మించి, తిట్లరూపంలో ప్రయోగించదగిన పదాలేవీ యీయనగారి (మట్టి) బుర్రకు తట్టనేలేదు. ఇంకా ఏవేవో తిట్లకోసం వెతుకుతున్నట్లే వెతుకుతూ, తన చేతిలో యీటె పుచ్చుకొని ఆ పోలీసును ఒక్కచరుపు చరిచాడు. వాడు యీ దెబ్బకు కాసుకొని వుండలేదేమో, దెబ్బ తగిలీ తగలటంతోటే నేలమీదబోర్లబొక్కలా పడిపోయాడు.

ఈ దృశ్యం చూస్తున్న మిగిలిన పోలీసులందరికీ మాంచి ఆవేశం వచ్చింది. ముగ్గురూ లాఠీలు పుచ్చుకొని డాన్ క్విక్ సెట్ గారిమీద దూకబోయారు. ఇలా ముగ్గురు పోలీసులు తనమీదకు విరుచుకువస్తున్నా, డాన్ క్విక్ సెట్ గారుమాత్రం మహాధైర్యంగా గుర్రం మీద కూర్చొనివున్నాడు. ఈయనకు వున్న యీ మొండిధైర్యానికి, నిజానికి, డాన్ క్విక్ సెట్ గారు ఆరోజు వాళ్ళచేతుల్లోచిక్కి చావవలసినవాడే! కానీ యింతలో ఓ గమ్మత్తు జరిగింది.

గొలుసుతో కట్టబడివున్న ఆ డజనుమంది బందీలు యీ సందడిలో ఎలా తప్పించుకొన్నారో, కట్లుఅన్నీ వూడదీసేసుకున్నారు.

శాంకోపాంజాగాడికి ఎలా చేతఅయిందో ఏమోకానీ, బందీ అయివున్న ఆ రౌడీ, 'గైన్స్-డి-పస్సామాంటీ' వంటిమీద వున్న గొలుసుకట్లన్నీ విప్పేశాడు. ఆ రౌడీ సందు చూచుకొని, డాన్ క్విక్ సెట్ గారి చేతిలో దెబ్బతిని మట్టి నాకుతున్న పోలీసుమీద పడి, అతని తాలూకు కత్తినీ, తుపాకినీ, 'స్వాధీన పరచుకొన్నాడు. ఈలోగా మిగిలిన బందీలందరూ బండెడు కంకరరాళ్లు పోగుచేసుకువచ్చారు. ఈ రౌడీ తుపాకీ మడమతో చేతికందిన పోలీసునల్లా పొడిచి పొడిచి వదిలిపెట్టుతుంటే, మిగిలినవాళ్ళందరూ రాళ్లు రువ్వి వారిని తరిమి తరిమి కొట్టారు. ఈ డజనుమంది కురిపించే రాళ్ళవానకు తట్టుకోలేక పోలిసులు పారిపోయారు.

పోలీసులు అందరూ కనుచూపుమేర దాటిపోయాక, డాన్ క్విక్ సెట్ గారు వీరోచితంగా సకిలించి, ఆ డజనుమందినీ యిలా తన ఎదుటికి వచ్చి కళ్లెంకట్టి నిల్చోమన్నాడు. వాళ్ళందరూ దగ్గరసా జరిగి నిల్చొన్నారు. ఏదో పెద్ద యుద్ధంలో హోరాహోరీ పోట్లాడి, శత్రుసమూహాన్ని పారద్రోలిన పిదప సేనానాయకుడు తన సైన్యాన్ని వుద్దేశించి వుపన్యసించే ధోరణిలో, యీయనకూడా ఒక వుపన్యాసం ప్రారంభించాడు.

వీరులుఅంటే ఎవరో, వీరోచిత కార్యాలంటే ఏమిటో ముందుగా వివరించాడు. తదనంతరం యీనాడు తాను వీరికి ప్రసాదించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యము లెంతటి వుదాత్తవిషయాలో మరింత విశదంగా చెప్పాడు. ఇవన్నీ చెప్పి, వాళ్ళందరినీ ఒకపని చేయమని పురమాయించాడు. ఆ పనేమంటే—యీ డజనుమందీ కట్టకట్టుకొని 'టొబోసో' పట్టణానికి పోయి, అందుగల అనన్యరూపసి డల్ సీనియా రాకుమారి సమక్షంలో, 'భీకరానన వీరశూరాగ్రేసరుడు' డాన్ క్విక్ సెట్ మహాశయుడు యీనాడు సలిపిన పోరాటంలో ప్రదర్శించిన ధైర్యసాహసాలను వేనోళ్ళ కొనియాడమని కోరాడు. తామందరినీ అధికారులబారి నుండీ రక్షించి, స్వేచ్ఛాజీవులుగా ఒనరించిన వైనం ఎవరికి ఓపినంతమటుకు వారు వివరించవలసిందిగా హుకుం వేశాడు. తన ఆజ్ఞమేరకు డల్ సీనియా రాకుమారికి తన ప్రతాపమును ఎరుకపరచినమీదట, వాళ్ళంతా ఎవరి యిష్టంవచ్చిన చోటికి వారు పోవచ్చునని సెలవిచ్చాడు. ఆ డజనుమందీ అంతసేపూ యీయనగారి వుపన్యాసం ముసిముసి నవ్వులతో వింటూనేవున్నారు. ఆ వుపన్యాసం సాంతం విన్నాక

ఆ రౌడీ శాస్త్రముందుకు జరిగి, వున్నపళంగా అందరూ కట్టకట్టుకు 'టొంబూసో' పట్టణానికి పోవటమనేది చస్తే కుదరని విషయమని తేల్చివేశాడు. పట్టపగలు రాజబాటవెంట తామందరూ పోవటమనేది చేజేతులా మళ్ళీ పోలీసులకు లొంగిపోవటమే అవుతుందని కరాఖండిగా చెప్పివేశాడు.

"ఛౌరారా! మీకై ప్రాణములనైన లెక్కసేయక అధికారులతో పోరాడి మీ కారాగారవాసముల తప్పించిన నన్నే ధిక్కరింతురా! మీ మాత్సర్యములనిదే అణచివైచెద! ఈ 'భీకరానన వీరశూరాగ్రేసరుడు' యిట్టి కుటిలజన ధిక్కారములను సైరించునే!" అంటూ డాన్ క్విక్ సెట్‌గారు యింకా ఏవేవో పెద్దగా అరుపులు అరుస్తున్నాడు. ఈలోగా ఆ రౌడీచేసిన సైగ అందుకొని, మిగిలిన బందీలందరూ, యింతకుముందే పోలీసులమీద ప్రయోగించటానికి పోగుచేసిన రాళ్ళలో మిగిలినవాటిని, యీాయమీదకు ప్రయోగించారు. అన్నివైపులనుంచీ వచ్చిపడుతున్న యీ రాళ్ళజోరుకు ఆగలేక, డాన్ క్విక్ సెట్‌గారు గుర్రం మూపుమీదినుంచి కిందికి దొర్లిపోయారు. క్రిందపడ్డ యీ వీరుడిమీదకు ఆ డజనుమందీ విరుచుకుపడ్డారు. వాళ్లల్లో ఒకడు యీాయనగారి నెత్తిమీద వున్న యిత్తడి బొచ్చెను వూడలాగి, ఆ బొచ్చెతోనే ఆయనను తెగబాదాడు. అసలే అంచువూడిపోయిన ఆ బొచ్చె, వాళ్ళచేతుల్లో సాంతం సొట్టలుపడిపోయి, దాని అసలు ఆకారం ఎలావుండేదో వూహించటానికైనా వీలులేకుండా తయారుఅయింది. ఈయనగారు వుక్కుకవచం మాసిపోకుండా, రక్షణకోసం పైన తొడుక్కున్న చొక్కాను కాస్తా మరొకడు వూడలాక్కున్నాడు. ఇంకొకడుపోయి, శాంకో

(3౨-వ పేజీ చూడండి)

# మా నాన్నగారి సంతకం

"ఏంరా సోము, పరీక్ష లెలా రాశావు?" అన్నారు మా నాన్న; అప్పుడే భోంచేసి సిగిరెట్టు వెలిగిస్తూ. ఆమాట వినటంతోనే నా గుండెలు గుభేలుమన్నాయి. మానాన్నని ఆమాట మరిచేటట్లు చేయాలని "నాన్నా మరి, యీ క్రిస్టమస్ సెలవలకు నేను అత్తయ్యగారి వూరు పోవద్దూ" అన్నాను. మా నాన్నగారు అడిగిన ప్రశ్నకు సమాధానం యియ్యకుండానే మానాన్న నావల్లో పడతారా!

"ఏడిశావులే; పరీక్ష లెలా రాశావురా అంటే, అత్తయ్యగారి వూరు పోతానంటా వేం?" అని గుడ్లురిమి సిగిరెట్ పొగ ఉఫ్ అని గట్టిగా వొదిలేటప్పటికి నా పై ప్రాణాలు పైనే పోయినాయి.

ఇక లాభం లేదురా బాబు; మన బురిడీలు యిక్కడ సాగవనిపించి "ఆ! ఏమిటి నాన్నగారు-పరిక్షలా ? పరీక్షల కేం; ఫస్టుగా వ్రాశాను. ఈసారి మా క్లాసు పిల్లలంతా అన్ని ఫస్టుమార్కులూ నావే అనుకొంటున్నారు" అని కోసేశాను—మళ్ళా స్కూలు తెరిచేదాకా యేసంగతీ తెలియుదు కదా అన్న ధైర్యంతో. సరిగా పరీక్షలు వ్రాయలేదని యిప్పుడే గనుక చేప్పేనా, యిక ఆ కోపంతో నన్ను అత్తయ్యగారి వూరు పోనివ్వకపోవటంమాట అటుంచి యిప్పుడే వీపు చిట్లు కొట్టేస్తారు.

"అయితే బాగనే వ్రాసేవన్నమాట. అయినా తెలుస్తాయిగా!" అని అన్నారు. ఆమాటకే నాకు పరీక్ష తప్పిపోతే వురితీస్తాడేమో నన్నంత భయంవేసింది. ఈ రోజేదో కోపంగా వున్నట్లున్నారు. మామూలుగా అయితే నన్ని విధంగా యెన్నడు కోప్పడరు. ఆయనకు నేనొక్కడినే కొడుకును. అంచేత నేనంటే మహాగారాబం!

"అయితే నాన్నగారూ, అత్తయ్యా నన్ను సెలవుల్లో పంపమని వుత్తరం వ్రాసింది కదా; పంపరా ?"

"శెలవుల్లో 'ఎక్సకర్షన్' పోవాలని పరీక్షలముందు నాల్గు రూపాయిలు పట్టుకెడితివి కదుట్రా! మరి ఎక్సకర్షనుకు పోవూ?" అనేటప్పటికి నాకు యేడుపొచ్చింది.

నా ఎక్సకర్షన్ చరిత్ర ఏమిటంటే-పరీక్షల ముందర జీతం కట్టమని యిచ్చిన మూడు రూపాయిలు ఐస్‌ఫ్రూట్లకు, చాక్లెట్లకు, మా బడి దగ్గర అమ్మే జీడిపప్పుకు ఖర్చయింది. ఇక జీతం యేం కట్టేదీ ; నా మొఖం ! మా నాన్నగారు నాకు రోజుకో అర్ధణా యిస్తునే వుండేవారు. అది ఏమూలకు ! పరీక్షలు దగ్గరకొచ్చాయి. ఇంకా నాల్గురోజులున్నాయి అనగా, క్లాసులోకి ఒక నోటీసు పట్టుకొని ప్యూన్ వచ్చాడు. వాడ్ని చూచేటప్పటికే నాకు వణుకు పుట్టుకొచ్చింది. పోయిన సారి క్వార్టర్లీ పరీక్షకు రమణ జీతం కట్టలేదని హెడ్మాస్టరు పరీక్షకు రానియ్యనని బెదిరించాడు. కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమిలాడితే ఎలాగో రానిచ్చాడు. అందువల్ల యీ నోటీసు అదే అయివుంటుందని నా కప్పుడే అనుమానం తోచింది. మాష్టారు నోటీసు చదివి, "సోమూ, నీవు జీతం కట్టకపోతే పరీక్షలకు రానివ్వరు" అన్నారు. ఏం చేసేదీ! క్లాసుపిల్లలందరు నావైపే చూస్తున్నారు.


శ్రీ అంబటిపూడి వెంకటసుబ్బరామయ్య


"అయినా నీవు పరీక్షలకుకూర్చున్నా ఒకటే, కూర్చోక పోయినా ఒకటేలే" అని మాష్టారు అనేటప్పటికి నాకు తల కొట్టేసినట్లైంది. పిల్లలంతా ఫక్కున నవ్వేరు. నాకు మామాష్టారిమీద భలే కోపం వచ్చింది. ఎట్లాగయినా జీతం కట్టాలి. పరీక్ష కొచ్చి బాగా వ్రాయాలి. జీతం ఎట్లా కట్టేటట్లు? జీతం కట్టినా పరీక్షల్లో ఏం వ్రాసేది! నాకు "ఓ"అంటే "ఢం" రాదు కదా!

ఒక ప్లాను వేశా. ఇంటికెళ్ళి మా నాన్నతో "ఎక్స్కర్షన్ పోతున్నాము. పరీక్షంకు ముందే డబ్బు క్లాసులీడరు కివ్వాలిట." అని చెప్పేను.

భగవంతుని దయవల్ల నా ప్లాను పారింది. చల్లగా నాల్గు రూపాయిలు వసూలుచేసి జీతం మూడు రూపాయిలు చెల్లించి పరీక్షలకు కూర్చున్నాను. మిగిలింది మన జల్సాలకింద ఖర్చు అయిపోయింది.

ఇప్పుడు మానాన్న 'ఎక్స్కర్షను పోవా,' అంటే ఏం చెప్పేదీ? అన్నీ చిక్కులే - మహా చికాకేసింది.

మళ్ళీ మా నాన్నగారు రెట్టించి అడిగారు "ఎక్స్కర్షన్'కు పోకపోతే డబ్బన్నా పట్టుకురా" అన్నారు.

"లేదు నాన్నా, స్కూలు తెరిచిం తరువాతకు పోస్టుపోను చేసే"రన్నాను.

"ఏడిశావు, అన్నీ అబద్ధాలే" అంటూ మా నాన్నగారు అప్పటికి బయటికి వెళ్ళిపోయారు.

సెలవులయిపోయినై. స్కూలు తెరిచారు. మా అత్తయ్యగారి వూరినుండి స్కూలు తెరిచిన నాల్గు రోజులుదాకా నేనుతిరిగి రాలేదు. అందుకుగాను మా నాన్నగారిచేత తిట్లుతిన్నాను; మా క్లాసుటీచరుచేత అట్లు పొందేను.

మా పేపర్లుయిచ్చారు. పేపర్లు చూసేటప్పటికే ఎక్కడిప్రాణాలు అక్కడపోయినాయి. అన్నీ అయిదులు, ఆర్లు! లెక్కల్లో జీరో!! పేపర్లు మానాన్నగారు చూస్తే. చివాట్లు తప్పవు!

ఒక ప్లానువేసేను. లెక్కల్లో సున్నావస్తే ఆ సున్నను నూరుగా మార్చేశాను. ఇక దిగులేముంది! తక్కిన పేపర్లుకూడా మన హస్తలాఘవంవల్ల అరవయిలు, డెబ్భయిలుగా మారిపోయినాయి. ఈ పేపర్లు మా నాన్నగారికి చూపెట్టాను. ఆయన మోసపోయారు; పాపం! నన్ను మెచ్చుకొని నాకో అర్ధరూపాయి, యిచ్చేశారు. లక్ (అదృష్టము) అంటే యిలా గుండాలి!

సెకండుఫారంలో చేరిన మోజుకొద్దీ ఆ నాల్గురోజులూ బాగా చదివాను. అందువల్ల క్వార్టర్లీలో



యిరవయిలు, పాతికలు వచ్చాయి. మనవాడికి చదువు కొత్తలెమ్మను కొన్నారు, అప్పుడు మా నాన్న గారు. ఇప్పుడు నేను చూపెట్టిన మార్కులుచూసి మరీ మెచ్చుకున్నారు.

నాల్గురోజులు గడిచాయి! 'ప్రోగ్రసుకార్డు' లిచ్చారు. దాన్ని చూసేటప్పటికి, 'మళ్ళీ నాకిదో శనై చుట్టుకుందిరా బాబూ' అనిపించింది దానిమీద మా నాన్నగారి చేత సంతకం పెట్టించుకురావాలి. నాకొచ్చినమార్కులు ఎన్నో యీ కార్డుతో బట్టబయలు అయిపో





తుంది. ఇదిగనక మా నాన్నగారు చూసేరా, నన్ను చావచితకపొడుస్తారు. ఏంచెయ్యటానికీ తోచక ఆ కార్డును తీసుకొని మెల్లిగా పార్కులోకి పోయి, చెట్లచాటుగా కూర్చొని మా నాన్నగారిమాదిరిగా ఆయన సంతకం నేనే పెట్టేశాను అంటే యింతకుముందు క్వార్టర్లీ పరీక్షలయినతరువాత వొక్కసారి మా నాన్నచేత సంతకం పెట్టించుకొని వచ్చానుగా. ఆ సంతకంకూడా యీ కార్డుమీదే ఓపక్కగా వుందామె! దాన్నిచూసి యివతల ఆయన గారిసంతకం డ్రాయింగ్ వేసేశాను.

మర్నాడు ఆ కార్డు పట్టుకెళ్ళి క్లాసులో మాష్టారికిచ్చేను. "మీ నాన్న ఏమన్నారు?" అని అడిగాడు మాష్టారు. "ఏమీఅనలేదు" అన్నాను. నా కార్డును కూడా మాష్టారు సరిగా పరీక్షచెయ్యకుండా మిగిలినవాటితోపాటు బొత్తిపెట్టేశారు. బ్రతికిపోయా ననుకొన్నాను.

మరొకవెధవ తనకార్డు సంతకం పెట్టించుకోకుండా తెచ్చేడు. వాడి దుంపతెగ! వాడ్ని తన్నాలనిపించింది.

ఈసంగతి కనిపెట్టిన మాష్టారు, అంతకుముందే తీసుకున్న వాళ్లందరి కార్డులూ మళ్లీ పరీక్షచేయటం మొదలెట్టేరు.

ఉన్నట్లుండి "సోమూ! లే." అన్నాడు. 'మరేం ఫరవాలేదులే! నాదానిమీద సంతకం వుందికదా' అని ధీమాగా లేచి నిలవబడ్డాను. దగ్గరకు రమ్మని, చెవిపట్టుకున్నారు. "ఈ సంతకం ఎవరు పెట్టేర"ని గద్దించి అడిగారు.

"మా నాన్నగారేనండీ" అన్నాను; వస్తున్న ఏడుపు దిగమింగుకొని.

"ఈ సంతకంపెట్టింది మీ నాన్నగారేఅయితే, సంతకం చివర 'గారు' అనికూడా ఆయనే పెట్టారట్రా" అని అంటూనే నా మెడకాయవంచివీపుమీద వొక్కటేశాడు. నాకుతారామండలం కనిపించింది. ఆ వెధవ, సంతకం లేకుండా తేబట్టి కదా, నాగుట్టు బయటపడిపోయింది! అయినా నాదే పొరబాటులెమ్మని నాకోపం చంపుకున్నాను. తెలియక సంతకంచివరను చేర్చిన "గారు" చేసింది యింతపని. ఇకమీదట మానాన్నగారిని పిలిచేటప్పుడు కూడా 'గారు' వుపయోగించకుండా 'నాన్న' అనిమాత్రమే పిలవాలని నిశ్చయించుకొన్నాను. ఆ విషయం అంతటితో ఆగిపోయినా బాగుండేది.

మా మాష్టారు మా యింటికొచ్చి, మా నాన్నతో జరిగిందంతా చెప్పేశాడు. ఇదంతా నే గదిలోవుండి వింటూనేవున్నాను. నన్ను చావచితకకొట్టమని మా నాన్న మాష్టారితో చెప్పేడు. మా నాన్నకు యిప్పుడు కంటపడరాదని చెప్పి, దొడ్డిగుమ్మాన స్కూలుకు బయలుదేరాను. గవర్నమెంటు ఆసపత్రివరకు వెళ్లేటప్పటికి నాకో ఆలోచనతట్టింది. వెంటనే ఆసుపత్రిలోనికిపోయి, కంపౌండరును బ్రతిమలాడి కొంచెం దూది, కొంచెం గుడ్డ తీసికొని బయటికొచ్చి అరచేతిలో బాగా లావుగా కట్టు కట్టుకొని బడికి పోయాను. క్లాసు ప్రారంభమయ్యాక మా మాష్టారు

నా చేతికి కట్టువుండటం చూసి "ఏమిటిరా అబ్బాయి, చేతికి?" అని అడిగాడు.

"మీరు మానాన్నతో జరిగిన సంగతి చెప్పేరుట. అందుకని ఆయన బెత్తంతో చేతిమీద కొట్టారండి. ఆదెబ్బలకు చెయ్యి చిట్లిపోయింది" అని బొంకేశాను.

"అయ్యో పాపం! ...అయితే నాకు పని తప్పించారన్న మాట, మీ నాన్నగారు" అన్నాడు మాష్టారు పెద్ద వుద్ధరింపుగా.

చేతికి కట్టు వుండటం చూసి మానాన్న అడిగితే, "మాష్టారు కొడితే దెబ్బతగిలింది. ఆసుపత్రిలో కట్టు కట్టించుకున్నా" నని చెప్పేను; కాని యెవ్వరుకూడ కట్టువిప్పి చూపమన్లేదు. మనకు అంతే చాలు!

కాని పొరపాటున మర్నాడు కట్టులేకుండా బడికి పోయా. చేతికి గాయంలేదు. మాష్టారు నిన్నటి సంగతి అంతా జ్ఞాపకం పెట్టుకొని అబద్ధం చెప్పినందుకు చావ చితకగొట్టేరు. ఏడుస్తూ యింటికొచ్చాను. గుమ్మంలోనే యెదురైన మానాన్న చేతికి కట్టు లేకపోవటం చూసి యింత నాటకంఆడుతావా అంటూ, దబీదబీ వీపుమీద గుద్దులు వేశారు. ఏం చేసేదీ? మానాన్న సంతకం ఫోర్జరీ చేసినందుకుకదా నా చరిత్రంతా బయటపడ్డది; ఫోర్జరీ చేయనేపోతే మార్కులు రానందుకు, మానాన్న ఒక్కడిచేతనే తన్నులు తినేవాడిని. అంతటితో తీరిపోయేది. నాటకమాడి వీపుమీద మద్దెలవరసలు మోగించుకొన్నాను. ★

# గడియారం చెప్పిన కథ



(గతసంచిక తరువాయి)

డ్రాజెస్ అనే అతడు బొమ్మల చేతనే ఓ నాటకం నాటకమంతా ఆడించేవాడని గడియారం చెప్పుతుంటే, సుందరానికి చాలా సరదా వేసింది. "ఊ! చెప్పు" అంటూ గడియారాన్ని తొందర చేశాడు.

"చెప్పుతున్నానోయ్! సుందరం. ఆ డ్రాజెస్ తయారు చేసిన బొమ్మల నాటకం చాలా పేరు ప్రఖ్యాతులను సంపాదించింది. తెరయెత్తగానే ఒకపెద్ద మైదానం కనుపిస్తుంది. మైదానానికి అటుచివర ఆల్ప్స్ పర్వతపంక్తులు వుంటాయి. ఆ కొండల దగ్గిరగా రైతులువుండే పూరిపాక ఒకటి కనుపిస్తుంది. ఆ మైదానంలో అక్కడకొన్ని, యిక్కడకొన్నిగా, కొన్ని గొఱ్ఱెలు మేస్తూవుంటాయి. కొంతమంది గొఱ్ఱెలకాపర్లు కూడా కనిపిస్తూ వుంటారు. మైదానానికి యింకో కొసనుపిండిమర ఒకటి వుంటుంది.

"పూరిపాక అన్నానే, దాని ముందు గేటు తెరుచుకోవటంతో ఆట ప్రారంభమౌతుంది. ఆ పాకలోనుంచి మామూలురైతు ఒకడు గాడిదమీదయెక్కి, గేటులోనుంచి యివతలకు వచ్చి, ఆ మైదానంమీదుగా మిల్లువైపుకు ప్రయాణంచేస్తాడు. ఈయనను చూసి, గొఱ్ఱెల కాపరుల తాలూకు కుక్కలుకొన్ని మొరగటంమొదలు పెట్టుతాయి. కుక్క మొరగటం విని, ఆ ప్రక్కనే వున్న ఒక కొండగుహలోనుంచి గొల్లవాడొకడు బయటకు వచ్చిచూచి, మరేమీ ప్రమాదంలేదని గ్రహించి, అక్కడే ఒక రాతిబండమీద కూలబడి పిల్లంగోరుమీద చక్కనిపాటలు రెండుమూడు వరసగా వాయించేస్తాడు.

"ఈలోగా ఆ రైతు మైదానం దాటి మిల్లు ఆవరణలోకి వెళ్తాడు. వెళ్లేటప్పుడు గాడిద నెక్కివున్న వాడల్లా మళ్ళీ తిరిగి వచ్చేలోగా రెండు సంచులనిండా పిండి పట్టించుకువచ్చి, గాడిదమీద పడేసి, దాని కళ్లెం పుచ్చుకు మైదానంమీదుగా నడిపించుకొంటూ తన, పాకకు తిరిగి వస్తాడు." వూపిరి తీసుకోవటానికి గడియారం ఆగింది.

"గమత్తుగా వున్నదే! గాడిదను ఎక్కివున్న బొమ్మ మళ్లీ నడవటమూ, గుహలోనుంచీ బయటకు వచ్చిన గొల్లవాడు పిల్లంగోరు వాయించటమూ చిత్రమే." అన్నాడు సుందరం.

"అంతేకాదు: యింకా విను. ఆ బొమ్మ నాటకంలో నీలి ఆకాశం కూడా కనుపిస్తూనేవుంటుంది. ఆ ఆకాశంమీది సూర్యబింబంకూడా ఆట మొదలైనప్పటినుంచి అంత



ఓటి ట్రాములో ప్రయాణం.

మయ్యేలోగా, ఆవైపున కదలటం ఆరంభించి అలా అలా ఎక్కివచ్చి యీ వైపున అస్తమిస్తుంది."

"అవును; యీమాదిరి బొమ్మల నాటకాలు మనదేశంలో కూడా వున్నాయిగా. మొన్న యీవూళ్లో జరిగిన ఎగ్జిబిషన్‌లో చూపెట్టారు. దానిపేరు... "బొమ్మలాట్టం" అంటారనుకొంటాను" అన్నాడు సుందరం; వెనుక చూసిన విషయాలను జ్ఞాపకం తెచ్చుకొంటూ.

"అదేలే! ఈ బొమ్మలాటంలో బొమ్మలను ఆడించే వ్యక్తి ఒకడు తెరవెనగ్గా ఎవరికీ కనుపించకుండా, చేతివేళ్లకు దారాలు కట్టుకొని, ఆదారాల సహాయంతోనే బొమ్మల కాళ్లూ చేతులు అవీ ఆడిస్తుంటాడు. నేను చెప్పిన బొమ్మలమాదిరిగా యీ బొమ్మలు పాటలేవీ పాడవు. పాటలన్నీ తెరవెనుకనుంచీ ఆడదో, మొగవాడో ఎవరో ఒకరు పాడుతూండవలసిందే!"

"అది సరే కానీ కూలీని తన్నే గడియారాన్ని నీ వెరుగుదువా?" సుందరమే అడిగాడు.

"కూలీని తన్నే గడియారమా! ఎవళ్లైనా తన్నే తాహతు అసలు మా గడియారాలకు ఎన్నడైనా వున్నదా!" గడియారం నిర్ఘాంత పోయి అడిగింది.

సుందరం ఫక్కున నవ్వాడు. "అంత గాభరా పడతావేమిటి! కూలీని తన్నే గడియారంఅంటే మరేమీలేదు - గడియారాలమ్మే ఒక షాపులో వెనుక ఒకసారి యిలాటి గడియారా నొకదాన్ని చూశాను. 'సెకండు'ముల్లు వున్నది చూడూ-అది త్వరత్వరగా కదులుతుందిగా. ఆ ముల్లుకుబదులు, యీ గడియారంలో అక్కడ ఒక బొమ్మను పెట్టారు. కూలీవాడొకడు మోకరిల్లి దణ్ణంపెట్టుతూ కూర్చొని వున్నట్లు ఒకబొమ్మ వుంటుంది. సూటూ, గీటు, వేసుకొని హేట్ పెట్టుకొన్న దొర ఒకడు బూటు కాలెత్తి ప్రతిసెకండుకీ ఒకసారి యీ కూలీని తన్నుతూవుంటాడు."

"ఓ, అదా! ఎరుగుదునులే. పెండ్యులానికి బదులుగా పంజరంలో పెట్టిన చిలుకబొమ్మ వూగుతూ వుండే గడియారాలుకూడా కొన్ని వున్నాయి."

(ఇంకావుంది)

# డాన్ క్విక్‌సెట్

(31-వ పేజీ తరువాయి)

పాంజాను తన్ని, వాడిదగ్గిర వున్న పెద్దదుప్పటి నొకదానిని లాక్కొన్నాడు. ఇలా బాగా అరగంటసేపు అందరూ ఆ స్వామినీ, యీ బంటునీ చేతికందితే చేతితోనూ, కాలికందితో కాలితోనూ, చెయ్యీ, కాలు నొప్పిపుట్టితే కర్రలతోనూ రాళ్ళతోనూ కొట్టికొట్టి, వీళ్ల తాలూకు ఏవస్తువు దొరికితే ఆవస్తువునల్లా పట్టుకు చక్కాపోయారు.

వాళ్ళంతా అలా పోయాకకూడా, గంటసేపటి వరకు డాన్ క్విక్‌సెట్‌గారు కాని, శాంకో పాంజాకానీ పెదిమలు కదిలించి మాట్లాడలేకపోయారు. ఇంతసేపూ ఆ గాడిద 'డాపుల్' మాత్రం బుర్ర తెగ ఆడించేస్తోంది. ఇందాక ఆ దొంగల మూరావాళ్ళు విసిరిన రాళ్లు, వానజల్లులాగా తడవతడవకు వచ్చి మీద పడుతుంటే, యీ గాడిద కళ్ళు మూసి తల ఆడించటం మొదలుపెట్టింది. రాళ్ళవాన ఆగిపోయి గంటైనా కూడా, ఆ గాడిద యింకా రాళ్ళు ఏవో వచ్చి మీద పడుతున్నట్లే వూహించుకొని, బుర్ర ఆడించటం ఎంతకీ ఆపనేలేదు.

ఆ 'రోజినాన్‌టే'కి కూడా, రాళ్ళు తగిలాయేమో,—అదీ నేలమీద నాలుగుకాళ్ళూ నాలుగువైపులకూ బారజాపి పడుకొనివుండిపోయింది.

డాన్ క్విక్‌సెట్‌గారి విషయం చెప్పనే అక్కరలేదు. పుణ్యానికి పోతే తనకు ఎదురైన పాపాన్ని తలుచుకొంటూవుంటే ఆయనకు గుబులుగుబులుగా ఏడుపువస్తున్నది. గట్టిగా ఏడవటానికైనా ఓపిక లేకుండాపోయింది.

శాంకో పాంజాగాడికి అసలు అంతకుముందు నుంచీ కయ్యాళిగా వున్నదేమో; యిప్పుడు జరిగిన యీ శృంగభంగానికితోడు తన తాలూకు దుప్పటి కూడా పోయినందుకు, వాడు రెండుచేతులూ నెత్తిమీద పెట్టుకు అల్లంతదూరంలో కూలబడి, కుమిలి కుమిలి ఏడుస్తూ, తడవతడవకు ముక్కూ కళ్లూ తుడుచుకొంటున్నాడు.

ఈ సంఘటన తరువాతనే డాన్‌క్విక్‌సెట్‌గారి ద్వితీయ జైత్రయాత్ర ముగిసింది. వళ్ళంతా గాయాలతో డాన్‌క్విక్‌సెట్‌గారూ, ఆయనబంటూ యిద్దరూ స్వగ్రామానికి తిరిగివచ్చారు.

ఎన్ని దెబ్బలు తిన్నా, డాన్ క్విక్‌సెట్‌గారు యిలా బుద్ధిగా యింటికి తిరిగి వచ్చినందుకు ఆయన మేనకోడలు, దాసీ యిద్దరూ చాలా సంతోషించారు. వాళ్ళిద్దరూకలిసి యీయనకు మందులు, మాకులూ వేసి, పథ్యంపానం సరిగా చూసి, గాయాలన్నీ నయం చేశారు. వీళ్ళపరిచర్యలమూలంగా పీనుగల్లేవచ్చిన మనిషి కొంచెం పుంజుకొన్నాడు. ఆ ఆడవాళ్ళు యిద్దరూ మళ్ళీ యీయన కొంప విడిచి ఎక్కడ పోతాడోనని, వేయికళ్లతో కనిపెట్టి చూస్తునేవున్నారు. వాళ్లు భయపడుతున్నంతపనీ కొద్దిరోజుల్లో, జరుగనే జరిగింది. అందుకే అంటారు మనపెద్దలు—'పుర్రెతో పుట్టినబుద్ధి పుడకలతోకాని పోద'ని!

(ఇంకావుంది.)

# రెండు మహానగరాలు

(14-వ పేజీ తరువాయి)

చిత్రం : మాట మనిషిని పట్టిస్తుంది; మాట వింటే మనిషి సంగతి తెలీదూ!'

తను అంత తేలికగా అంతు దొరకటం ఆ గూఢచారికి బాధ గానే వుంది; కాని డిక్కుముఖం వేయలేదు. నవ్వేశాడు.

'డాక్టర్ గారి అమ్మాయి పెళ్లి చేసుకో బోతోంది—ఒక ఫ్రెంచి జమీందార్ని పెళ్లిచేసుకోబోతోంది. గాస్పర్డ్ చిత్ర వధకు కారకుడైన ఆ జమిందారు మీకు తెలుసుగదూ — ఆయన సంతతివాణ్ణే—అంటే ఇప్పుడు జమీందారు అవుర్రాడేనన్న మాట. ఆయన యిప్పుడు ఇక్కడ లేడు లెండి — ఇంగ్లండులో నే వున్నాడు. చార్లెస్ డార్నే అనే మారుపేరుతో వున్నాడు.'

ఆ వార్త విని కూడా మాడమ్ డిఫార్జ్ యెప్పటిమాదిరి నిబ్బరంగానే కూర్చుని కుట్టుకుంటోంది. మాన్సియర్ డిఫార్జ్ మాత్రం చలించిపోయాడు; అది కప్పుకోవటానికి నిప్పుపుల్ల గీసి పైపు ముట్టించుకుంటున్నాడు. నిప్పుపుల్ల పట్టుకున్న అతని వేళ్లు రెండూ కంపించుతూనే వున్నయ్. ఆ చలనాన్ని గనక పసిగట్ట లేకపోతే ఆ గూఢచారి గూఢచారే కాదన్నమాట.

ఆ ఒక్క స్వల్పవిజయాన్ని అర్జించుకుని, అంతకంటే మరో అవకాశం యేదీ అప్పట్లో లభించే సావకాశం కనుపించక, బర్సాడ్, తాను చెల్లించవలసిన బిల్లు చెల్లించుకుని బయటికి వెళ్లిపోయాడు. పోతూ పోతూ వనక్కి తిరిగి, త్వరలో తిరిగి దర్శనం చేసుకుంటానని చెప్పిపోయాడు. అతను మళ్ళీ తిరిగి లోపలికి వస్తాడేమోననే భయంతో ఆ భార్యాభర్తలిరువురూ అతను బయటికి వెళ్లిపోయిన అయిదారు నిమిషాలవరకూ అలానే కిక్కురు మనకుండా ఊరుకున్నారు.

అనంతరం, డిఫార్జ్ గొంతు తగ్గించి, భార్యమెడమీదికి వంగి: 'వీడు మిస్ మానెట్‌ను గురించి చెప్పిందంతా నిజమే నంటావా ?' అన్నాడు.

'వాడు చెప్పాడు గనక అబద్ధమే కావచ్చు—నిజమయినా అవొచ్చు!'

'అది గనక నిజమైతే...'

'ఆఁ!—నిజమైతే—'

'—ఆమాట నిజమైతే అమ్మాయి మొగుడు యిక్కడికి రాకుండా అక్కడే వుండిపోతే అదృష్టవంతుడు.'

'ఎవడిగతి యెలావుందో అలా జరుగుతుంది. ఎవడు ఎక్కడ నశించాలో విధి వాణ్ణి అక్కడికి యీడ్చుకుపోతుంది.' అన్నది మాడమ్ డిఫార్జ్.

'ఎలాగైనా యిది చాలా విపరీతమైన సంఘటనగా కనిపిస్తోంది. డాక్టర్ మానెట్‌ను మనం యెంతో కడుపులో పెట్టుకుని ఆదరించాం; ఆయనకూతురుమీదకూడా మనకెంతో వాత్సల్యం వుంది. ఆ అమ్మాయి పెనిమిటిపేరు ఇప్పుడు బయటికి వెళ్లిన ఆ వెధవలాంటి వాళ్ళ పేర్లతోపాటు బ్రతుకగూడనివాళ్ళ జాబితాలో మనమే స్వయంగా యెక్కించవలసి రావటం విపరీతమైన సంఘటన కాదూ ?'

'ఆ సమయంవస్తే, ఇంకా ఇంతకంటే విపరీతమైన సంఘటనలు ఎన్నో నాజరుగవలసిరావచ్చు' అంటూ నెత్తిమీదవున్న గులాబి పువ్వు తీసి బల్లమీద వుంచేసింది.

ఆ పువ్వు తీసి అలా బల్లమీద వుంచటమే తడవు; బయటినుంచి ఒకరొకరే అంతా లోపలికి వచ్చేస్తున్నారు. ఒక అయిదారు క్షణాల్లో పానశాల యథాప్రకారం కిటకిట లాడిపోయింది.

సాయంత్రంపూట, సాధారణంగా సెయింట్ ఆంటోనీ వీధిలో వుండే ఆడా మగా యావన్మందీ, కొంచెం ఊపిరి పీల్చుకోవటానికి యిళ్లలోనుంచి బయటికి వచ్చి కూర్చుంటారు; కొంతమంది వీధిగడపలమీద చతికిలబడి బాతాఖానీ వేస్తారు మరికొంతమంది ఆ వీధి మొగిలోనూ యీ వీధిమొగిలోనూ బృందాలు బృందాలుగా జేరి లోకాభిరామాయణం చెప్పుకుంటూ వుంటారు. మాడమ్ డిఫార్జ్, లతలు కుట్టుకుంటూ ఆ గుంపు దగ్గరనుంచి మరో గుంపు దగ్గరికీ, మరో గుంపుదగ్గరనుంచి మరో గుంపు దగ్గరికీ తిరుగుతూ వుంటుంది—ఏదో మతప్రచారం చేస్తూ.

ఆ ప్రాంతంలోవున్న ఆడవాళ్లంతా, యెప్పుడూ యేదో వొకటి కుడుతూనే వుంటారు. వాళ్ల దవడలూ పేగులూ కదులుతూవుండటానికి యెక్కువ ఆస్కారం లేదుగనక, వాటికి మారుగా ఊచలు తేలిపోయిన వేళ్ళు అలా కదులుతూవుంటే కొంత ఉపశమనగా వుంటుంది. వేళ్ల చలనం ఆగిపోతే కడుపులో వున్న పేగులు చలించి మరింత భీభత్సంగా ఆకలి పుట్టిస్తూవుంటుంది. ఆ బాధకు తట్టుకోలేక యెప్పుడూ యేదో ఒకటి కుట్టుకుంటూ కూర్చుంటారు.

వేళ్ల కదలికతోపాటు చూపులుకూడా చలించుతూవుంటై, చూపులతోపాటు భావాలుకూడా పరుగులుపెడుతూవుంటై. మాడమ్ డిఫార్జ్ వాళ్ల చేరువకు వచ్చినప్పుడు ఈ మూడూకూడా మరింత ఉజ్వలంగా చలించిపోతూవుంటై.

భార్య అలా ఒక బృందం దగ్గరనుంచి ఒక బృందం దగ్గరికి సాగిపోతూవుంటుంటే, మాన్సియర్ డిఫార్జ్, తన గుమ్మంలో నిల్చుని ఠీవిగా చుట్ట కాలుస్తూ లోలోపల అభినందించుతూ వుంటాడు :

'గొప్ప ఆడది! బలసంపన్నురాలు! బ్రహ్మాండమైన మనిషి! నిజంగా ఆలోచిస్తే భయంకర వీరనారి!'—

చీకటి అలుముకుంటోంది. గడపలమీద కూర్చునున్న స్త్రీలకు దూరాన్నుంచి చర్చిగంటలూ, రాజప్రాసాదంనుంచి సైనికపటహాల ధణధణారావాలూ వినిపించుతున్నయ్. వాళ్ల చుట్టూకూడా చీకట్లు అలుముకుంటున్నయ్. అంతకంటే దట్టమైన మహాంధకారం ఫ్రాన్సును మొత్తంగా అలుముకోబోతోంది. ఈనాడు చర్చి గోపురాలన్నిటిలోనూ జిలుగు జిలుగుగా మోగే చిరుగంటల నన్నిటినీ కరగి భీభత్స నినాదాలు చేసే ఫిరంగి గొట్టాలుగా పోతబోసే దుర్దినం ఆసన్నమాతోంది. ఆ స్త్రీలు అలానే, కుట్టుకుంటూ మెట్లమీద కూర్చుని నేల రాలిపోయే తలలను లెక్కపెట్టుకుంటూ కన్నీరు కార్చవలసిన దురంధతమసం నలుమూలల నుంచీ చుట్టేసుకొస్తోంది. ★



న్యూవాయిస్ పిక్చర్సువారి "హైదరాబాద్"లో
నిగార్ సుల్తానా



జె. ఎస్. పిక్చర్సువారి "జగ్గూ" హిందీ చిత్రంలో శ్యామ.

# మోషన్ పిక్చర్ ఎకాడమీ

**1950** వ సంవత్సరపు ఉత్తమ చిత్రాల నిర్మాతలకు, ఉత్తమ నటీనటులకు, మోషన్ పిక్చర్ ఎకాడమీ వారు గతమాసం 27 వ తేదీన బహుమతులిచ్చారు. ఈ సందర్భంలో సెంట్ మేరీస్ హాలులో జరిగిన సభకు మంత్రి ఎస్. బి. పి. పట్టాభిరామారావు గారు అధ్యక్షత వహించారు. "ఏళైపడుంపాడు" (తమిళం) నిర్మాత శ్రీరాములు నాయుడు, "జీవితం" (తెలుగు) నిర్మాత ఎ. వి. మెయ్యప్పచెట్టియార్ గార్లకు, నటి శ్రీమతి అంజలీదేవి, నటుడు వి. నాగయ్యగార్లకు మంత్రిగారు బహుమతులు అందజేశారు. నిర్మాతలకు వెండి ట్రోఫీలు, నటీనటులకు బంగరు పతకములు ఇవ్వబడినై.

మోషన్‌పిక్చర్ ఎకాడమీని 1951 అంతంలో డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్ అధ్యక్షుడుగా మద్రాసుప్రభుత్వం వారు స్థాపించారు. సినిమాకళను ప్రోత్సహించటానికి ఏర్పరచబడిన ఈ ఎకాడమీ 1952 ప్రారంభంలో పని ప్రారంభించింది. 1950లో విడుదలయిన 45 చిత్రాలను ఎకాడమీవారు పరిశీలించి ఉత్తమచిత్రాలను, నటీనటులను నిర్ణయించారు.

ఈ నిర్ణయాన్ని రాష్ట్రప్రభుత్వం ఆమోదించింది. కాని ఈ ఎకాడమీని ఇకమీద రద్దుచేస్తున్నామని, రద్దయిపోయేముందు బహుమతుల ఏర్పాట్లను ఎకాడమీ తనంతటతనే చేసుకోవలసి ఉంటుందనీ కూడా ప్రభుత్వం ప్రకటించింది. సరిగ్గా ఆ సమయానికి దక్షిణభారత ఫిల్మ్ వాణిజ్యమండలివారు ముందుకు వచ్చి ఎకాడమీని ఆదుకున్నారు. బహుమతులకు, సభకు అయ్యే ఖర్చును మండలివారే భరించారు. తత్ఫలితంగా గత మాసాంతంలో బహుమతి ప్రదానం జరిగింది.

రాష్ట్రప్రభుత్వం చేసిన రద్దు నిర్ణయం తమ్ము అయోమయస్థితిలో పడవేసిందనీ, ఈ నిర్ణయం సమంజసంగా లేదనీ ఎకాడమీ కార్యదర్శి డి. రామానుజంగారు సభలో విమర్శించారు. మంత్రి పట్టాభి రామారావుగారు మాట్లాడుతూ, సినిమా వ్యవహారాలన్నీ క్రమేణా కేంద్రప్రభుత్వపు అజమాయిషీలోకి పోతున్నందున రాష్ట్రప్రభుత్వం ఈ ఎకాడమీని రద్దుచేసిందని చెప్పారు.

మంత్రిగారు ఎకాడమీని రద్దుచెయ్యటం విషయమై చెప్పిన కారణం ఎవరినీ సంతృప్తిపరచినట్టు లేదు. సినిమా పరిశ్రమను, కళను ప్రోత్సహించవలసిన బాధ్యతను రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వానికి వదిలిపెడితే, కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వంపైకి తోసివేస్తున్నది. వినోదం పన్ను తగ్గించాలని ఫిల్మ్‌ఫెడరేషన్ ఇటీవల కేంద్రప్రభుత్వాన్ని కోరినప్పుడు, ఆ విషయం తమ చేతుల్లో లేదనీ, వివిధరాష్ట్రప్రభుత్వాలతో సంప్రదించి వారి సమ్మతిమీదగాని తామేమీ చెయ్యలేమనీ కేంద్ర సమాచారశాఖా మంత్రి డా॥ కేస్కార్ సమాధానమిచ్చారు.

అధికారరీత్యా ఎవరేమి చెప్పినా కేంద్ర రాష్ట్రప్రభుత్వాలకు సినిమా పరిశ్రమమీద కించిత్తయినా గౌరవం ఉన్నట్లు తోచటం లేదు. మంత్రులు గాని, ఇతర ప్రభుత్వాధికారులు గాని సినిమాలమీద ఎప్పుడు మాట్లాడవలసివచ్చినా నీతిసూత్రాలు వల్లించటం తప్ప మరేమీ చెయ్యటం లేదు. ఈమధ్య ముఖ్యమంత్రి రాజాజీ సినిమా చిత్రాలు పూర్తిగా అవినీతిమయమై ఉన్నాయనీ, ప్రజలు వాటిని బహిష్కరించాలనీ అన్నారు. కాని అంత మరీ ద్వేషించదగినంత అవినీతి సినిమాపరిశ్రమలో ఉందా అనీ, మరే పరిశ్రమలోను, సంస్థలోను అవినీతి లేదా అని సందేహం కలుగుతున్నది. (రాజాజీ దృష్టిలో పోలీసు శాఖ అన్నిటికంటే నీతివంతమైనది!) అలాగే ఆలిండియా రేడియోనుంచి ఫిల్మ్ రికార్డుల ప్రసారం తగ్గించటానికి ప్రభుత్వం చేసిన నిర్ణయంకూడా అన్యాయంగా ఉన్నది. ఈ నిర్ణయం ఫిల్మ్‌పరిశ్రమను, అవమానించటంతప్ప మరేమీ కాదు. ఫిల్మ్

పాటలు బూతుల బుంగలుగా ఉంటున్నా యని ఒక కారణం చెప్పబడింది. కాని అంత బూతుల బుంగలైన పాటలను సినిమా ప్రదర్శనాలలో సెన్సారువారు ఎలా అనుమతిస్తున్నారో దురూహ్యం. రేడియో సెట్టులు ఉపయోగిస్తున్నవారిలో అధిక సంఖ్యాకులు ఫిల్మురికార్డుల ప్రసారాన్నే ఆదరిస్తున్నారనటం అతిశయోక్తి కాదు. ఏమైనా ప్రభుత్వం ఈ నిర్ణయం చేయబోయేముందు లైసెన్సు రుసుము చెల్లిస్తున్న రేడియోసెట్ సొంతదారులను ప్రశ్నావళిద్వారా సంప్రదించి ఉండవలిసింది. సెక్సుకు సంబంధించిన అసభ్యతను నిరోధించ దలుచుకుంటే ఫిల్మ్ పాటలను రేడియోనుంచి తొలగించినంతమాత్రాన చాలదు. ప్రాచీనకాలపు సెక్సు ప్రబంధాలను, ప్రస్తుతకాలపు సెక్సుసాహిత్యాన్ని, క్షేత్రయ్య పదాలలాంటి కావ్యఖండాలని కూడా నిషేధించాల్సి ఉంటుంది. ఆఖరికి భరతనాట్యాన్ని కూడా నిషేధించాల్సి ఉంటుంది. (ఒకసారి మద్రాసులో ఒక భరతనాట్య ప్రదర్శనం జరిగింది. నాట్యగత్తె భరతనాట్యానికి అనువైన వేషం సంతరించి రంగస్థలంమీదికివచ్చింది. ప్రేక్షకులలో ఒక ప్రభుత్వాధికారి కూడా ఉన్నారు. ఆయన కొంతసేపు కూర్చుండి నాట్యగత్తె వేషంమాసి భరించలేక ఛీ అనుకుంటూ వెళ్లిపోయారు!)

ఇక మోషన్ పిక్చర్ ఎకాడమీకి పట్టిన గతి గూర్చి ఆలోచిద్దాం. దీనిని స్థాపించిందీ ప్రభుత్వమే; రద్దుచేసిందీ ప్రభుత్వమే. స్వాతంత్ర్యసిద్ధి అనంతరం కేంద్రంలోను, రాష్ట్రాల లోను ఏర్పడిన జాతీయ ప్రభుత్వాలు కళలను ప్రోత్సహించటానికి కొంత కృషి చేసినమాట నిజమే. మద్రాసు ప్రభుత్వం రాష్ట్రంలోని వివిధభాషల్లోని ఉత్తమకవులను నిర్ణయించి వారికి ఆస్థానకవులనే బిరుదిచ్చి బహుమతులిచ్చింది. కేంద్రప్రభుత్వం ఆ మధ్య దేశంలోని ఉత్తమ గాయకులకు బహుమానాలిచ్చింది. కాని బహుమానాలివ్వటం ఏదో లాంఛనప్రాయంగా జరుగుతున్నదే కాని ఆయా కళల్లో కృషిచేసేవారికి ఏవిధమైన చైతన్యం కలిగించటంలేదు. ఇక సినిమాకళకు కవిత్వానికి, సంగీతానికి ఇచ్చినంత ఆదరణ కూడా ఇవ్వటంలేదు. అసలు సినిమాచిత్రాలను ఒక కళగా కూడా ప్రభుత్వం పరిగణిస్తున్నట్లు లేదు. సినిమా పారిశ్రామికులు పెడదారులు తొక్కుతున్నట్లు భావిస్తే వారిని సరియైన మార్గానికి తిప్పటానికి ప్రయత్నించటంలో తప్పేమీలేదు. కాని అసలు సినిమాకళే నాశనమైతేనే బాగుండునని అనుకోవటంలో అర్థంలేదు.

## అంజలీదేవి

ఉత్తమ నటిగా బహుమతి పొందిన అంజలీదేవి 1946 లో గొల్లభామలో నటించినప్పటినుండి ఇప్పటివరకూ సుమారు 80 తెలుగు, అరవ చిత్రాలలో నటించి అసమానఖ్యాతి సంపాదించుకుంది. ఈమె అన్నిరకాల పాత్రలను నటించగల సమర్థురాలని ఆ మెచిత్రాలే ఋజువుచేస్తాయి. ఈమె ఇప్పుడు నటిస్తున్న చిత్రాలు: ఏవి ఎమ్‌వారి "గర్ల్" (హిందీ, తెలుగు, తమిళం) జూపిటర్ వారి "ఇన్స్పెక్టరు" (తెలుగు, తమిళం) రాజరాజేశ్వరీ వారి "పేదరైతు" (తెలుగు, తమిళం) జయంతీవారి "విలేజి గరల్" (తెలుగు, తమిళం) అంజలీవారి "పరదేశి" (తెలుగు, తమిళం) మనోహరావారి "స్వర్గ ద్వారం" (తెలుగు, అరవం) బొంబాయి చంద్రకళాపిక్చర్సువారి "శకరంభ" (హిందీ). అంజలీదేవి జూపిటర్ వారు తీయసంకల్పించిన మరొక చిత్రంలోకి, విజయావారు తీయుదలచిన ఇంకొక చిత్రంలోకికూడా బుక్ అయింది.

## వి. నాగయ్య

ఉత్తమ నటుడుగా బహుమతి పొందిన శ్రీ నాగయ్యగారు ఈమాదిరి బహుమతులు పొందటానికిదే మొదటిసారి కాదు. "గృహలక్ష్మి"లో మొదటిసారి నటించినప్పటినుండి ఈనాటివరకు 80 చిత్రాలకు పైగా వీరు నటించినవి ఉన్నాయి.

ఇప్పుడు అవరిండియా వారి "నా యిల్లు", ఎ. వి. ఎమ్. వారి "గర్ల్", అరుణావారి కొత్తచిత్రం, ఇంకా మరికొన్నిటిలో నటిస్తున్నారు. నాగయ్యగారు నటుడుగానే కాక డైరెక్టరుగా, మ్యూజిక్ డైరెక్టరుగా, గాయకుడుగా ప్రసిద్ధికెక్కారు. తెలుగు, తమిళసినిమారంగాలలో వీరికి సమానమైన కీర్తి ఉన్నది. ★



పీపుల్స్ ఆర్ట్ వారి "పల్లెటూరు"లో నాయకుడు చంద్రం (ఎన్. టి. రామారావు)



జెమినీవారి "ముగ్గురు కొడుకులు"లో నాగేంద్రరావు, శ్రీరాం.

# "ఆన్"పై లండన్‌పత్రికల వ్యాఖ్యలు

లండన్ రియాల్టో సినిమాలో జులై 18 న విడుదలైన "ఆన్" చిత్రానికి లండన్‌పౌరులు గొప్ప స్వాగతం ఇచ్చారని పత్రికలు రాస్తున్నాయి. ఆ చిత్రంలో కథానాయికగా నటించిన నిమ్మీ ఆ సందర్భంలో అక్కడ హాజరైనందున ఆమెకు కూడా గొప్ప స్వాగతం ఇవ్వబడిందట. ఆమె ఫొటోలు, ఆమెను గూర్చిన వాఖ్యలు చాల పత్రికలు ప్రకటించాయి. టైమ్స్ పత్రిక "ఆన్"ను గూర్చి రాస్తూ ఈ చిత్రం చూస్తేగాని నమ్మలేనంత బావుందని రాసింది. డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక ఇలా రాసింది. "డగ్లస్ ఫెయిర్ బాంక్స్ (సీనియర్) చిత్రాల్లో కూడా ఇంత 'థ్రిల్' కలిగించే దృశ్యాలు మనం చూడలేదు. ఎరోల్ ఫ్లిన్ చిత్రాలన్నీ కలిపి చూసినా ఈచిత్రంలో ఉన్నన్ని కత్తియుద్ధాలు లేవు. అక్కడక్కడ ఇతర్ల నుంచి కాపీకొట్టినా 'ఆన్' కొత్తరకంగా, వినోదకరంగా ఉన్నది." డెయిలీగ్రాఫిక్, డెయిలీ మిర్రర్ పత్రికలు కూడా "ఆన్"ను గూర్చి నిమ్మీని గూర్చి ప్రశంసలు ప్రకటించాయి.

న్యూస్టేట్స్‌మన్ ఎండ్ నేషన్ వార పత్రిక మాత్రం విమర్శిస్తూ ఇలా రాసింది: "భావంలోను, సిద్ధాంతంలోను, కథాచిత్రణంలోను ఈ చిత్రం పూర్తిగా భారతీయమని నిర్మాతలు చెబుతున్నారు. భారతదేశం సినిమాల ఉత్పత్తిలో ప్రపంచంలో రెండోస్థానం ఆక్రమిస్తుంది. బహుశా 'పూర్తిగా భారతీయ'మని చెప్పదగిన అంశాలలో అమెరికాను అనుకరించటం కూడా ఒకటైనట్లు కనిపిస్తున్నది. 'ఆన్'లో అధిక భాగం 'థీఫ్ ఆఫ్ బాగ్దాడ్' మొదలు చిత్రాలను తలపించేటట్లున్నది. ఈచిత్రంలో ఒక స్థానిక ఫెయిర్ బాంక్స్, ఒక స్థానిక మార్లిన్ డీట్రిచ్ ఉన్నారు. నృత్యాలు, కత్తియుద్ధాలు, ఈతలు, ఎగరటాలు, కాపలావాళ్లని మోసగించటాలు, గుర్రపుపరుగులు వగైరా వగైరాలన్నీ ఉన్నాయి. రెండుగంటల ఏడునిమిషాల టైములో పృథివిలోగల సమస్తాన్నీ 'ఆన్'లో చూపించదలిచినట్లున్నారు నిర్మాతలు. క్లైమాక్స్ దుస్సహంగా ఉంది: స్తంభానికి కట్టివేయబడిన రాజకుమారిని అగ్నిజ్వాలలు సమీపించటం, ఒక కత్తియుద్ధం, ఒక పెద్ద తాళాన్ని బద్దలు గొట్టడానికి ఒక మనిషి ప్రయత్నించటం, ఒక కోటను ధ్వంసం చెయ్యటానికి ముందుకుంటూ వస్తున్న ఫ్యూజ్ తీగ, మారువేషంలో ఉండి బయటపడటానికి సిద్ధంగా ఉన్న ఒక రాజు, ప్రజాస్వామ్య పరిపాల

నవయుగవారి "జ్యోతి"లో జ్యోతి—జి. వరలక్ష్మి.

నకు పరిపక్వమౌతున్న ప్రజానీకం—ఇవ న్నీ క్లైమాక్సులో భాగాలు. కొన్ని చక్కని భారతీయ ప్రకృతిదృశ్యాలు చూపబడిన మాట నిజమే. కాని అంతకంటే ఎక్కువగా భారతీయ స్టూడియో చూపబడింది. ఈ చిత్రంలో బాక్ గ్రౌండ్ తెర బాక్ గ్రౌండ్ తెరగానే కనిపిస్తుంది. దిలీప్ కుమార్, నిమ్మీలు ఈ చిత్రంలో ముఖ్యాకర్షణలు. కథ మధ్యమధ్యలో చొప్పించబడి చక్కని లయతో, ముక్కుతో పాడబడిన పాటలు కూడా బాగున్నాయి...ఈ కథ ప్రాచీన భారతదేశంలో జరిగిన జానపదకథ అని నిర్మాత లన్నారు. కాని కొత్తమోడల్ కార్లు కనిపిస్తాయి..."

మొత్తానికి లండన్ పత్రికల, విలేఖరుల వ్యాఖ్యలు చదివితే "ఆన్" చిత్రాన్ని లండన్ ప్రేక్షకులు 'జూ'లోకి కొత్త జంతువు వస్తే వేలంవెర్రిగా చూసినట్లు చూస్తున్నారని, తోస్తున్నది.

"ఆన్" చిత్రం రియాల్టోసినిమాలో నాలుగువారాలపాటు ప్రదర్శించబడుతుందట. ఈ చిత్రం మామూలు కెమేరాతోనే తీయబడినది. ప్రింటుమాత్రం టెక్నికలర్ లో చేయబడినది. ★



వాహినీవారి "పెద్ద మనుషులు" షూటింగ్ త్వరలో ప్రారంభమౌతుందట. ఈ చిత్రంలో శ్రీరంజని, లింగమూర్తి, శేషమాంబ, ఆమె కుమార్తె ఉంటారని తెలుస్తోంది. సంగీతం ఓగిరాల రామచంద్రరావు. డైలాగ్సు డి. వి. నరసరాజు. డైరెక్టరు కె. వి. రెడ్డి.

*   *   *

అంజలీ పిక్చర్స్ వారి "పరదేశి" దాదాపు పూర్తయినట్లే. మరొక సెట్టుమీద మాత్రమే పని జరగవలసిఉందని తెలుస్తోంది. అంజలీదేవి భారత్ భూషణ్ తో కలిసి చంద్రకళా పిక్చర్సువారి "శుకరంభ" అనే పౌరాణిక చిత్రంలో నటిస్తున్నది. ఈ నెలలోనో వచ్చేనెల ప్రారంభంలోనో ఆమె బొంబాయి వెళ్ళవచ్చునట.

*   *   *

నిర్మాతగా మారిన నటుడు అశోక్ కుమార్ తన మొదటిచిత్రానికి కథగా శరత్ బాబు నవల "పరిణీత"ను ఎన్నుకున్నాడట. బిమల్ రాయ్ డైరెక్టుచేస్తాడట...అశోక్ కుమార్ అహ్లువాలియా అనే మరొక నిర్మాతతో కలిసి "వాజిద్ ఆలీషా" అనే చారిత్రిక చిత్రం తీయనున్నాడు. బ్రిటిష్ డైరెక్టరు హెర్బర్టు మార్షల్ ఈ చిత్రం డైరెక్టు చేస్తాడు. ఈస్టిండియాకంపెనీ మన దేశాన్ని పాలిస్తున్న రోజుల్లోని ఆఖరి అయోధ్యనవాబు జీవితాన్ని ఈ చిత్రంలో చిత్రిస్తారట. రచయిత ముల్క్ రాజ్ ఆనంద్ ఈ కథకు అవసరమైన అంశాలను లండన్ లో సేకరిస్తున్నాడట. అశోక్ కుమార్ నాయకపాత్ర ధరిస్తాడట. ★



1950 సంవత్సరపు ఉత్తమ నటుడుగా బహుమతి పొందిన
శ్రీ వి. నాగయ్య

# ప్రశ్నలు సమాధానాలు

**కో. హ. శివాజీరావు—విజయవాడ**

విడుదలైన తెలుగుచిత్రాలన్నిటికి మీరు రివ్యూ లివ్వరేమండీ! ప్రెస్‌షో యిస్తేనే రివ్యూ రాయాలనీ, లేకపోతే రాయకూడదనీ ఏమన్నా నియమం ఉందా?

—ఆ నియమం ఏమీ లేదు. కాని చిత్రం చూస్తేగాని రివ్యూ రాయగూడదని నియమం ఉన్నది.

* * *

**కొప్పల్లి మోహనకుటుంబరావు — విజయవాడ**

విజయదశమికి వెలువడే మీ ప్రత్యేక సంచికలోని రచనలన్నీ 15 సం॥లోపు బాలబాలికలే పంపాలా లేక యితరులు కూడా పంపవచ్చా?

—పోటీలో పాల్గొనే వారికి మాత్రమే వయస్సునుగురించిన నియమం వర్తిస్తుంది.

* * *

**వి. యస్. యల్. నరసింహం—విశాఖపట్నం.**

కులమతవర్గ విచక్షణ లేని ప్రభుత్వం కదా కాంగ్రెసు ప్రభుత్వం, ప్రతి ప్రభుత్వపురికార్డునుండి *Religion and Caste* అనే మాటను ఎందుకు తీసి వెయ్యరాదు?

—అలా తీసివెయ్యడానికి కొంత వ్యవధి పట్టుతుందని వారి వాదం.

* * *

**ఎస్. సాంబమూర్తి—పత్తికొండ.**

వాహినీవారి "మల్లేశ్వరి" చిత్రములో నాగరాజు, మల్లి తుంగభద్రతీరాన కలుసుకొన్నప్పుడు అది చూచిన జలజ మనస్సు ఎలాగుంటుందండీ?

—అది చూసినప్పటి మీ మనస్సులాగానే.

* * *

**బి. మంగరాజు—బొబ్బిలి.**

ఆంధ్ర ప్రజానీకమంతా రాష్ట్రము కోసము తపిస్తూంటే, మన కాంగ్రెస్ నాయకులంతా సవతితల్లి ప్రేమ చూపుతూ, ఏదో సాకులు చెప్తుండడములో గూడుపురాణి ఏమిటో శెలవిప్పిస్తారా?

—కాంగ్రెస్‌వారూ తీర్మానాలు చేశారు, చేస్తున్నారు.

* * *

**యం. కేశవరావు—మోతడక.**

రాబోయే విజయదశమినాటికి మీరు ప్రచురించే సంచికకు మేము పంపే బొమ్మలు కాయితంమీద కలంతో వేసి పంపించాలా? లేకపోతే పెన్సిల్‌తో వేస్తేచాలా?

—కాపీలు కొట్టని బొమ్మలు, యిండియన్ యింక్‌తో కలంకానీ, కుంచెకానీ వుపయోగించి తెల్లకాగితం మీద వేసి పంపితే చాలు.

* * *

**కోజా వెంకటశకుంతల—తెనాలి.**

'ఆన్' చిత్రం వ్యాపారప్రకటనలో కొడవలీ, సుత్తీ మార్కుగా వేశారు. అది కమ్యూనిజానికి సంబంధించిన సినిమానా?

—అది మెహబూబ్ ప్రొడక్షన్సువారి వ్యాపార చిహ్నం. నేతిబీరకాయలో ఎంత నెయ్యి ఉందో ఆ సినిమాలో అంత కమ్యూనిజం ఉంది.

* * *

**వి. వేణుగోపాలరెడ్డి—ముత్తుకూరు.**

స్త్రీలకు ఎక్కువ చదువు అనవసరమంటాడు నా స్నేహితుడు. అందువల్లనే మన దేశము ఈ స్థితిలో వుందంటాను నేను. ఎవరితో మీరేకీభవిస్తారు?

—ఆడవారికి గాని మగవారికి గాని చదువుల అవసరం సమానమే. చదువులు ఉద్యోగాలకోసమే అనుకున్నప్పటికీ, ఆడవారికీ మగవారికీ కూడా సమానంగానే అవసరం ఉంటుంది.

* * *

**మల్ల జోగినాయుడు—కాకినాడ.**

సహజత్వములేని కళను ప్రజాస్వామిక దేశంలో ప్రబలనివ్వడంకన్న వినాశనం చెయ్యడం ఉత్తమం! మీ ఉద్దేశం?

—వాస్తవికతలేని కళను పనిపెట్టుకుని నాశనం చెయ్యనక్కరలేదు. దానంతట అదే నశిస్తుంది.

ప్రేమ, స్వేచ్ఛావివాహాల విషయంలో వెంకటచలంగారి అభిప్రాయాలు ఆధునిక పరిస్థితుల్లో అమలు జరుప సాధ్యమైనవా? చలంగారిపై మీ అభిప్రాయం తెలియజేస్తారా?

—చలంగారి సాహిత్యంలో మాత్రమే అవి ఆచరణసాధ్యమైనవి. చలంగారికి సాహిత్య విప్లవకర్తగా చరిత్రలో శాశ్వతస్థానం ఉంటుంది.

* * *

**డి. వీరభద్రరావు—తాడేపల్లిగూడెం.**

ఒక చిత్రాన్ని టెక్నికలర్‌లో గాని, మామూలుగా గాని కాకుండా ఒకే రంగులో (అంటే, చిత్రమంతా ఆకుపచ్చలో కాని, ఎరుపులో కాని, నీలంలో కాని) నిర్మించవచ్చా? నిర్మిస్తే, ఆ చిత్రం ఎలా ఉంటుంది?

—విచిత్రంగా ఉంటుంది.

* * *

**వత్సా వెంకటరాజు—సాలూరు.**

మద్రాసు ముఖ్యమంత్రి ఆహార ధాన్యాలపై కంట్రోళ్ళు సడలిస్తూ కర్షకులనూ వర్తకులనూ స్వేచ్ఛను అనుభవించవలసినదిగా చెప్పినారు. ఇప్పుడు కేంద్రప్రభుత్వం లైసెన్సుపద్ధతి నిర్ణయించుటలో ఈ స్వేచ్ఛను అరికట్టుటయేగాక, అవినీతి, లంచగొండితనములకు దారితీయు యిట్టి వుత్తరువులు చేయబూనుట శ్రేయస్కరమేనా?

—లైసెన్సు పద్ధతి పెట్టినంత మాత్రంచేతనే ఇదివరలో బట్టలవ్యాపారానికి ప్రత్యేకమైన ఆటంకం ఏదీ ఏర్పడలేదు. ఇప్పుడు ఆహారధాన్యాలకీ అంతే. ఇకపోతే, లైసెన్సింగ్ పద్ధతివల్ల వ్యాపించబోయే అవినీతీ లంచగొండితనా లెక్కువ ముప్పా, లేక వ్యాపారంపైన ఏ పాటి కంట్రోల్ లేకుండాచేస్తే పెరగగల ధరలు ఎక్కువ ముప్పా అనేది తేల్చుకోవలసిన విషయం. ప్రభుత్వం ఒకటి ఎక్కువ ముప్పనుకుంటే, వర్తకులు ఇంకోటి ఎక్కువ ముప్పనుకోవచ్చు.

* * *

పి. వి. అప్పారావు—బరంపురం.

"లేటవరపు కామరాజు లేడా లేడా" అని ఒక ముక్క విన్నాను. దీనికేదో సాహిత్యగాథ వున్నదట. అదేదో చెబుతారూ?

—ఇది వేములవాడ భీమకవి చాటు పద్యాలలో ఒకదానికి సంబంధించినది. 'లేటవరపు పోతరాజు' అనే భాగ్యవంతుని దర్శనానికి కవీశ్వరుడు వెళ్లగా, ఆ భాగ్యవంతుడు ఇంటిలో ఉండికూడా లేనట్లు కబురు పంపాడట. అప్పుడు భీమకవికి కోపంవచ్చి ఇలా అన్నాడట.

'కూటికి కాకులు జేరెను
ఏటావల మూకజేరి ఏడువదొడగన్
కాటికి కర్రలు జేరెను
లేటవరపు పోతరాజు లేడా లేడా.'

కవివాక్కు శాపమై తగిలి పోతరాజు ఆ పూటే మరణించాడట. సాయంవేళ శవాన్ని కాటికి తీసుకొని పోతుండగా కవీశ్వరు డెదురై సంగతి తెలుసుకున్నాడు. తెలుసుకుని ఈ క్రిందరీతిగా అన్నాడట.

'నాటి రఘురాము తమ్ముడు
పాటిగ సంజీవిచేత బ్రతికినరీతిన్
కాటికిపో నీకేటికి
లేటవరపు పోతరాజ లెమ్మా రమ్మా.'

వెంటనే పోతరాజు బ్రతికి లేచాడని కథ ప్రచారంలో ఉంది.

* * *

ఎస్. శ్రీదేవి—కడప.

పోటీలోనికి పంపిన చిత్రములతో మూడు కానులు బిళ్లలు పెట్టిపంపిన తిరిగి పంపించెదరా?

—పంపగలం.

* * *

వేపకొమ్మ సుబ్బరావు—మద్రాసు

రాబోయే ఆంగ్ల చిత్రాల 'ట్రైలర్లు' ముందు చూపింపబడుతాయే, ఆ పద్ధతి మన చిత్రనిర్మాత లెందుకు అవలంబింపరు?

—అసలు చిత్రానికయ్యే ఖర్చు చాలకనా, ట్రైలర్లు తీయటం?

* * *

వి. పార్వతీశం—తొండంగి.

పత్రికలవారికి, తప్పకుండా, మొట్టమొదటి సారిగా "శ్రీవ్యూ" యివ్వ(?) గూర్చి మీరు సమర్థించుతారా? (?) అయితే చిత్రం మొదటిలోనే (ఒక్కొక్కప్పుడు) దెబ్బతింటుందేమో?

—బాగులేని చిత్రాన్ని బాగు లేదరాస్తే చిత్రం దెబ్బతింటుంది; బాగుంరాస్తే పత్రిక దెబ్బతింటుంది.

**సవరణ**

క్రిందటివారం "ప్రశ్నలు - సమాధానాలు" శీర్షికలో 4వ ప్రశ్న పంపినవారు మొదటి ప్రశ్న పంపిన పి. నాగేశ్వరరావు (పెనమలూరు)గారే ననిగమనించగోరుతున్నాము.

—సంపాదకుడు.

* * *

ఆర్. రామ్‌కిషన్, జగిత్యాల

విశాలాంధ్ర గురించి మీరు మాకి ఎక్కువ ఎందుకు కృషిచేయుచున్నా అర్థంగావటం లేదు. తెలియచేస్తారా?

—"మీరు" అంటే మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రులని మీ ఉద్దేశమనుకుంటా; అయితే మీరన్న దెంతవరకు నిజమో తె(?) గాకా ఆంధ్రనాయకులే చెప్పా(?) సర్కారు, రాయలసీమాంధ్రులు విశాలాంధ్ర స్థాపనకోసం ప్రయత్నిస్తున్నారంటే, ప్రజాస్వామ్య ప్రభుత్వంలోనూ దానికి ప్రధాన ప్రాతిపదికలలో ఒకటైన భాషాప్రయుక్త రాష్ట్రపునర్నిర్మాణంలోనూ, మాతృభాషలో పరిపాలనావిధు నిర్వర్తించడంలోనూ విశ్వాసం ఇం ఉండడమే కారణం.

* * *

నెల్లూరి వేదవతీదేవి—ఉప్పల.

25-6-52 ఆంధ్రవారపత్రికలో "వి(?) షీను(?)"అనేశీర్షికలో 'బ్రహ్మదేవుడికి ఫిర్యాదు' అని వ్రాసి, "ఇది నిజంగా గిన సంగతి" అని వ్రాశారు. ఇది న వచ్చునాండీ?

—బ్రహ్మదేవు డున్నా డని వి నమ్మినట్లైతే ఇదీ నమ్మవచ్చు. ఫిర్యాదులోని సంగతులూ వాటి స నాలూమట్టుకు నమ్మితీరాలి.

* * *

ఉ. బాబూరావు—కాకినాడ.

సర్రియలిజం అంటే ఏమిటి?

—జేమ్స్‌జోయిస్ రాసిన "యులిసి చదవండి! తెలియవచ్చు!

* * *

రాజా జోసఫ్ జ్యోతి—మదనపల్లి

టాగూర్, శరత్ వంటి గొప్ప రచించిన మేటి కథ లుండగా, ప్రొడ్యూసర్లు కల్పనా రచనలకు లాడడ మెందుకండీ?

—టాగూర్, శరత్ మున్నగు వలను ఇదివరకు చాలమంది తీశార తీస్తున్నారు. టాగూర్, శరత్ మాత్రం కల్పనారచనలు కావా

శీతలూ లెక్కేనటోయ్. అసలాక అచ్చటా
ముచ్చటా లేదని నే నఘోరిస్తూం
టేనూ!" అన్నది వదిన.

"ఏమో నమ్మా-నువ్వంతా కవిత్వం
లాగా, అర్థంకాకుండా మాట్లాడితే మాకేం
తెలుస్తుంది? అసలు మా అన్నయ్య నీకేం
కష్టం చేశాడో చెప్పవయ్యే."

"ఇదుగో మధూ...పక్కింటి వారి
కలు చూశావూ-రోజూ సినిమాకో,
షికారుకో, షైరుకో, వెళుతుందా...
.. నన్నెన్నడయినా మీ అన్నయ్య
వెంట బెట్టుకుని ఎక్కడికైనా తీసు
కెళ్లారా?"

ఆమాటలు వినేసరికి నాకు నవ్వాగింది
కాదు. "అయినా మనమిద్దరమూ కలిసి
వెళుతూనే వున్నాంగా వదినా...మా
అన్నయ్యకదేమిటో అలవాటులేదు.
ఎప్పుడు బయల్దేరినా ఎవరోఒకరు స్నేహి
తులు వెంట వుంటారయ్యే...అంతేగాని
నీమీద ప్రేమలేకనా? నీకోర్కె తీర్చే ఇష్టం
లేకనా...నువ్వే చెప్పాదినా? మాఅన్నయ్య
తప్పేముందో!"

"ఇష్టముంటే స్నేహితు లడ్డువస్తారా
ఏటోయ్? నువ్వు మరీ గమ్మత్తుగా
చెప్పావు. నాలుగురోజుల్ని చీ బ్రతిమాలు
తుంటే సినీమాకు తీసుకువెళ్లరయ్యే..."

"పోనీ మనం వెళ్దాం పద వదినా..."

"నే రానాను...ఆయన నన్ను వెంట
బెట్టుకు తీసుకెళ్లేదాకా సినీమా అనేది
చూడనే చూడను..." అంటూ చరచరా
లోపలికి వెళ్లిపోయింది...

పాపం! పల్లెటూరిదయినా భర్తతో
షికార్లకూ, సినిమాలకూ వెళ్లాలనే ఆశ!
ఎకదో తీరనికోర్కె అయి కూర్చుంది
మల్నె...మా అన్నేమో ఇంట్లో ఉన్నం
తసేపూ వదినను వదిలి ఉండలేడుగాని,
బయటికొచ్చారంటే ఆమెను మర్చిపోతాడు.
అయినా, ఆయనకది అలవాటూ, యీమె
కిది అలవాటూ అని తెలుసుకొని, ఒకరి
నొకరు అర్థం చేసుకోవాలి. ఒకరి లోపా
లొకరు క్షమించుకోవాలిగాని, యీ రుస
రుసలేమిటి?...

అదుగో! వంటింట్లో గిన్నెలు
దొర్లుతున్నాయ్. ఇహ రెండురోజుల
దాకా వదినగారి కోపానికి అంతుండదు...
వీళ్ళిద్దరిమధ్యా రాయబారాలు నడప
లేక నాదుంప తెగుతుంది. ఆవిడమీద
అన్న, అన్నమీద వదినే లక్షఫుల్లింగాలు
చెపుతారు. లక్షు దప్పట్లా..
సారి యీక వీళ్లిద్దరికీ ముడిపడదేమో
చాలా భయం వేస్తుంది నాకు...
శేమాషా ఏమిటంటే! మూడో
ద్దరూ నాకంటికే కనపడరు.

వాళ్లగదిలో ఆహ్లాదంతా వికవికలూ, పక
పకలూనూ...ఆరాత్రి పాయసంవంటతో
సర్దాగా భోజనాలవీ చేస్తాము... ★

# భూకా యాసము

(16-వ పేజీ తరువాయి)

వేసికొనివచ్చి మళ్ళీ కుర్చీలో కుర్చున్నా.
ఎండలు పెరిగిపోతున్నవి - ఈ సంగతి
మొన్న ఓ ముసలి డాక్టరుగారితో చెప్పితే,
ఆయన పరిహాసముగా నవ్వుతూ 'ఆ యేడు
కాయేడు పెరుగుతున్నది ఎండలు కాదు,
నీవయస్సు. వేడిని తట్టుకోలేక పోతు
న్నావు' అన్నాడు. బహుశా ఆయనా
ఈ విషయమై ఇదివరకే ఆలోచించి తన
వృద్ధాప్యమే ఎండలు పెరిగినట్లు తోచు
టకు కారణమని అనుకొన్నాడు కాబోలు-
ఆయన సమాధానము నేను నమ్మకపోయినా
ఎట్లా వాదించాలసింది తోచక ఊరు
కొన్నా. కాని ఈవేళ పత్రికల పుటలు
తిప్పుతూ వుండగా రోజు రోజుకీ భూమి
వేడెక్కుతున్నదని వ్రాసిన శ్రీ జార్
మన్ (*Georgeman*) వ్యాసము చూచాను.
ఆహా! అయితే మనము ఎప్పటివలే రైటేను.
డాక్టరుతో ఈ విషయము సగర్వముగా
ఎప్పుడైనా చెప్పుదామని నిశ్చయించు
కొన్నాను. వెంటనే తీసి ఆ పత్రిక
డాయరులో జాగ్రత్తపరిచాను. (ఈ
పుక్రోషమంతా నావయస్సు పెరుగు
తున్నదని డాక్టరు గుర్తుచేసినందుకే నను
కుంటాను!)-భూమండలపు ఉష్ణము దిన
దినానికి పెరుగుతున్నదని సశాస్త్రీయంగా
రూఢిపరచటమైనదట. కారణాలు చాలా
వున్నవట. బొగ్గుపులుసువాయువు ఎక్కు
వగా వుత్పత్తి అగుట, వృక్షజాలము
లన్నీ క్షీణించుట (వనమహోత్సవముల
ఆవశ్యకత ఇంక విదితమే) *Radio activity* ఎక్కువగుటచేతనూ ఈ ఉష్ణము అధి
కమగుచున్నదని పెద్ద పెద్ద శాస్త్రవేత్తల
నమ్మకమట. కొలది కాలములో ప్రస్తుతము
ఐసుతో కప్పబడ్డ ప్రదేశాలన్నీ నివాస
యోగ్యములగునట. త్వరలోనే భూమండల
ములో మనమునివసించుట అసాధ్యమగునని,
అప్పుడు మనము ఇతర గోళాలు ఏవైనా
నివాసయోగ్యమాయని వెదుకొక్కవలసి
వస్తుందని వ్యాసకర్త వ్రాసినాడు!

చంద్రమండలానికి ఎట్లాగూ వెళ్లే ప్రయ
త్నంమీదున్నారుకాబట్టి, ఈ భూమండల
నివాసులు భూమి అట్టే వేడెక్కకముందే
ఆ చంద్రమండలానికి ప్రయాణానికి శుభ
ముహూర్తము నిశ్చయించుకుంటే మంచిది.
'శుభస్య శీఘ్రం.' ★

…ed at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras

పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి





బావిలోన తొంగి చూడ - పాము, ఒక కోతీ, ఒక - మనిషీ, ఒక పెద్దపులీ - బాపని కగుపించారు - రక్షింపగ వేడారు



జాలిగొన్న బాపనయ్య - ఒక్కొక్కరినే - వెలికి తీసి కాపాడెను - అవసరమైనపుడు తాము - సాయము చేస్తామని వాగ్దానము చేశారు వారు



పొరుగూరికి పోయి యతడు
పనికోసం వెదికాడు
ఒక్క పని దొరకలేదు
ఇంటిముఖం పట్టి వస్తూ
లోగడ తను రక్షించిన
వారికడకు వెడదామని
ముందు కోతికడకు పోయె

విశ్వాసంగల కోతీ పళ్లెన్నో తెచ్చి యిచ్చి తీర్చెనతని క్షుద్బాధ



పులివద్దకుపోగా అది - పూర్వమెపుడో తను చంపిన - రాజుకొడుకు ఆభరణాల్ - బాపనయ్య కిచ్చింది



అవి తీసుకునా బ్రాహ్మడు నూతినుండి రక్షించిన బత్తునికడ కరిగి నగలు అమ్మిపెట్టమన్నాడు



రాజు కొడుకు వా నగలని బత్తుడు గుర్తించాడు బ్రాహ్మణుడే హంతకుడని రాజుతో చెప్పాడు. రాజభటులు బ్రాహ్మణుణ్ణి పట్టి ఖైదు చేశారు

బ్రాహ్మడు తన మిత్రమైన పామును ప్రార్థించాడు

పాము వచ్చి చక్కని ఒక వుపాయమ్ము చెప్పినది'



ఆ రాత్రే పాము పోయి రాణిగార్ని కరిచింది



"రాణిగార్ని ఎవరైనా రక్షిస్తే ఎంతైనా బహుమతి యిస్తారోహో!"



ఇది విని మన బ్రాహ్మడు తను రక్షిస్తానని వెళ్లి రాణిగార్ని తాకగానే ఆమె లేచి కూర్చుంది'



రాజెంతో సంతసించి సంగతంత తెలుసుకుని బత్తుని శిక్షించాడు



విప్రుని తన మంత్రిగ నియమించి ఆదరించాడు"



"కనుకనే, ఓ మృగరాజా! - కొత్త వార్ని చేరనివ్వ - రాదందరు మన పెద్దలు! - మిణ్ణల్లిని దరిజేర్చిన - నల్లి గతేమైందో తమ - కెరుగుదురనుకొంటాను!"



Rgd No. M 4479